# కృతి సమర్పణము

శ్రీరస్తంచు చిరాయురస్తనుచు నాశీర్వాదముఁ జేయుచుఁ
బ్రారంభించెద సుప్రసిద్ధమగు జంధ్యాలాన్వయుఁ, గీర్తి వి
స్తారోదారుని, శ్రీనివాసుని, విశేషప్రాజ్ఞు, సాంబయ్య సం
సారోత్కృష్ట తపఃఫలంబును సముత్సాహంబు దీపింపగఁ,

బంధు మిత్రు లటన్న ప్రాణప్రదంబుగా
కలుపుగోలు తనాన మెలగువాడు
సమ్మానముల నైన సభల నైనను తన
చేయి పైచేయిగా చెలగువాడు
ప్రభువు పోలిక మేడపైనుండి పనులన్ని
కనుసన్న సవరింప గలుగువాడు
విజ్ఞానవీధుల వెలయించి విహరించి
తనివి నొందని తీవి నెనయువాడు
పిన్న పెద్దల దయ జూరగొన్న వాడు
అన్నిట తనకు తానయై యున్నవాడు
ఉన్నవాడు రసజ్ఞుడౌ చిన్నవాడు
వాసిగొన్నాడు మా శ్రీనివాసరావు.

శ్రీల వెలుంగువాడు, గుణశీలుడు, గాన కళావిదుండు, జం
ధ్యాల కులోపశోభిత సుధాబ్ధి సుధానిధి, శ్రీనివాసు డు
ద్వేల మనః ప్రమోదమున " దేవుడి కోపము " కావ్య కన్యకన్
లాలసుడై వరించె కృతినాథుడుగా రసరాగ ముగ్ధుడై.

# సూచిక

# దేవుడి కోపం

[ అది చాలా పెద్ద గుడి. వాహనాల కొట్టు, పూలతోటా, సామానుల గదులు, ఆవరణ అంతా నిండి ఉంటవి. గుడి కావలాకంటూ ఒకటి రెండు యానాది కుటుంబాలు గూడా గుడి ఆవరణలోనే ఉంటవి.అర్చకుడు చాలా ధనవంతుడుగా కనపడతాడు. చేతులకు బంగారు మురుగులు, ఐదు వ్రేళ్లకు ఐదు ఉంగరాలు, చెవులకు కుండనాలు, మెళ్లో బంగారు గొలుసు, పెద్దాపురం పట్టుధోవతి, అలాంటిదే ఓకండువా నడుముకు, మొలలో బంగారు గొలుసు పొడుంకాయ, తడి కొల్లాయి బుజాన, చాలా దాబుగా ఉంటాడు. ఎడమ చేతిలో నైవేద్యము, కుడిచేతిలో మంచినీళ్ల చెంబు, రొండిన తాళపుచేతుల గుత్తి, చంకలో కుంచికోల, పట్టుకొని గర్భగుడిలోకి పోతాడు. నైవేద్యం కిందపెట్టి, చంకలో కుంచికోల గోడకు తగిలించి పూజ చేస్తుంటాడు. ]

అర్చకుడు:- కేశవాయనమః, మాధవాయనమః, హారే శ్రీ కృష్ణాయనమః, పుష్పైః పూజయామి, గంధం సమర్ప యామి, ధూపదీపానంతరం ఆచమన్యం సమర్పయామి, నైవేద్యం.

దేవుడు:- ఓరేయి! ఆగరా ఆగు!! ఆ గిన్నెలో ఏముందో విప్పి చూశావుట్రా?

అర్చ:- ఆ! ఆ!! చూడకేం! అయినా చూడకపోతే కొట్టుకు పోయిం దేముంది? భక్ష్య, లేహ్య, భోజ్య, మహానైవేద్యం సమర్పయామి.

దేవు:- ఓరేయ్! నీవెంత అబద్ధాలకోరువురా! ప్రతిరోజూ గూడా భక్ష్యాలంటావు, లేహ్యాలంటావు, మహా నైవేద్య మంటావు ... ఒక్కనాడు అయినా అవి తెచ్చావుట్రా! పచ్చడి మెతుకులే గాదుట్రా రోజూ!

అర్చ:- లేకపోయినా అట్లామంత్రంలో ఉంది. అదేపాటపాడుతూ ఉంటాము. లేకపోతే రోజూ మారుస్తామా యేంటి?

దేవు:- సరే మారిస్తే మార్చావు లేకపోతే లేదు. రోజూ, పెట్టే, ఆ పచ్చడి మెతుకులు గూడా లేదుట్రా ఈవేళ! అది ఒట్టి గిన్నెరా! అందుట్లోను నిన్నటి అంట్లగిన్నె మహా నైవేద్య మంటావుట్రా!! ఏం పోయేకాలమురా!

అర్చ:- (ధైర్యంగా) ఉంటే యేం. లేకపోతే యేం, స్వామీ! తమ రేమన్నా ఆరగిస్తారు గనకనా? ఏదో లాంఛనార్థం నైవేద్యం గాని? అసలు ఇవ్వాళ ఇంట్లోదానికి కాస్త నుస్తీగా ఉంది. అంచేత ముసల్ది కళ్లు కనపడక ఇలాచేసి ఉంటుంది. ఏదో పొరపాటు! క్షమించండి!!

దేవు:- లాంఛనార్థ మనేనట్రా నులక ఉండలు, ఎంగిలిగిన్నెలు నాకు నైవేద్యం పెట్టడం! నువ్వు తినేటప్పుడు, పెళ్లాం జబ్బువల్ల గాని, ముసలిదానికి కనపడక పోటం వల్లగాని, యే పొరపాటు జరగదే! నువ్వేమో పొట్ట పగిలేటట్టు తినాలి? నాకేమో ఈ రకంగా కంత్రీ చెయ్యడమా! మొన్ననిన్న దుర్మార్గాలు చేస్తున్నా, పోనీలే అని ఊరు కుంటూ ఉంటే, చివరకు ఆ నైవేద్యంగూడా లేకుండా

చేస్తావటరా!ఆరి నీ దుంప తెగ లోకానికి నేను దేవుణ్ణయితే,
నీవు నాకు దేవుడవయి, అన్నీ ఎగనాం పెడ్తావ్రుట్రా?

అర్చ:- శాంతం పాపం! శాంతం పాపం!! చూసీ చూడనట్లు
పోతుండాలి గాని అన్నీ అట్లా తెగిందాకా బిగదీస్తే రెండు
కండీ స్వామీ? తొందర పడకండి!

దేవు:- నేను తొందరపడుతున్నా నట్రా! నువ్వు యేంజేసినా
ఊరుకుంటే మంచివాణ్ణా! లేకపోతే తొందరానాది పేరూ
నీది నోరూనా? నాకని చేయించే సమస్తమైన ఉత్సవాలు,
సంతర్పణలూ, అలంకారాలూ, నీ వనుభవించటమూ, నే
నేమో రాతిబొమ్మగా నోరుమూసుకోని కూచోటమూనా?

అర్చ:- నిజమాడితే నిష్ఠురమే గాని, అంతగాక మరేముంది?
అయినా తమర్ని గాదని నే చేసిన దుర్మార్గ మేమిటో
కొంచెం చెప్పండి?

దేవు:- చెప్పటానికి ఒకటా! రెండా! మొన్నమటుకు మొన్న
ఉత్సవానికి వచ్చిన భోగంమేళం సందర్భంలో నీవు చేసిన
దుర్మార్గానికి అంతూ అగతీ ఉందీ? ఎందుకూ పనికిరాని
ముసలా ముతకా-పాత తుక్కు-ని- ఊరేగింపుకు పంపించి
ఆ వడుచుదాన్ని పోద్దస్తమానమూ నీయింట్లో ఉంచు
కోటమా! నీవు సేవకైనా రాకుండా, తల నొచ్చిందని,
ఓ కుర్రకుంకని పంపడమూ! అవొచ్చిన వెధవ నాగర్భగుడి
లోనే ప్రణయ భాగోతాలు ఆడడమా! వచ్చినవాళ్లు
నలుగురు పట్టుకోని తన్నడమా? ఇదంతా యేమంటావు?

అర్చ:- స్వామీ! మానవ శరీరాలు. మేము తొందరపడ్డామని మీరూ తొందర పడటమా! ఏదో క్షుద్రవాడు. తెలిసో తెలియకో చేసి ఉంటాడు! దానికే ఇంత గాద్ధాంతమైతే ఎట్లా చెప్పండి!

దేవు:- ఏమిట్రా చెప్పేది? వాడిదాకా యెందుకు? నీ పెద్దతనం యేం తగులడ్డది. పులికాపుకని తీసికొనిపోయిన బంగారు వస్తువులన్నీ భోగందానికి తగిలించావా లేదా? నాగుళ్ళో-నాతోటల్లో - పూచిన పూలన్నీ దండలు గుచ్చటానికి పట్టుకెళ్లి మీ రలంకరించుకొన్నారా? లేదా? పట్టు ధోవతులూ, జరీ ఉత్తరీయాలు, సిల్కు చీరెలు - నాకు ఊరేగింపుల్లో వచ్చినవి - కూతుళ్లకూ అల్లుళ్లకూ చది వించావా? లేదా?

అర్చ:- అయితే వచ్చినవన్నీ మీకే కట్టబెట్టి మేమేం నోట మట్టిగొట్టుకొని పోతామనా మీ ఉద్దేశం స్వామీ!అయినా ముందుగానే మీవి మీకు ప్రత్యేకంగాతీయించి అలంక రిస్తుంటే, యేమిటీ బజారునపడటం! మీకుధర్మమేనాఇది?

దేవు:- అవునురా నిజమే! నాకు ముందుగా తీయించినవి ప్రత్యేకం వాడిపోయిన పూలూ, చిరిగిపోయిన గుడ్డలూ, ఇత్తడితోచేసిన సొమ్ములూ, ఆహారంలేని అంట్లగిన్నెలూ, ...ఇవేగాదుట్రా? ఇవన్నీ చెపితే నేనుబజారున పడటమా!

అర్చ:- ఇదంతా మీకెవరుజెప్పారోగాని, అంతా అబద్ధమే! ఇదుగో కాకపోయినా ఇలాంటిరహస్య విషయాల్లో, తమరు

జోక్యంపుచ్చుకోటం అంతనిక్కచ్చిగా అడగటం, అంత బాగుండదు సుమండీ!

దేవు:- అదిగాదురా! నాకు నైవేద్యం పెట్టిన అన్నమేనీకు. పనికిరాక, యానాది వాళ్లకు ఇస్తున్నావే అలాంటప్పుడు నా సామగ్రి నుటుకు ఎలావనికొస్తుందా అంటాను?

అర్చ:- అయితేనాకు పనికిరాక యానాది వాళ్లకు ఇస్తున్నానను కొంటున్నారాయేంటి? అపరాధం! స్వామీ అపరాధం!! యేదో గుడి కనిపెట్టుకొని ఉన్నారుగదా అని వాళ్లకిస్తున్నా గాని వేరుగాదు సుమండీ!

దేవు:- అంత దయా నీకు అబ్బా! అలా అయితే, హారతికిచ్చే పావలాలు, అభిషేకాలకిచ్చే రూపాయిలూ, మహానైవేద్యాలకిచ్చే ఐదు రూపాయిలూ, — నాకోసం వసూలు చేసినవన్నీ—నీవే కాజేస్తున్నావేం మరి? ఉచితంగా ఇతరులను చెయ్యనియ్యవు. డబ్బు పుచ్చుకోనిగూడా నీవు చెయ్యవు? ఎన్నాళ్ళని ఇలా బాధపడేదిరా?

అర్చ:- స్వామీ! మీ భోగాలకేగా అలా వసూలుచెయ్యడం! అందులో మా దేముంది ?

దేవు:- ఏమీలేకపోవడం యేంఖర్మం! చివరకు హారతిపళ్లెంలో వేసే కానీలదగ్గర్నుంచి భద్రంగా ఇనపపెట్టెలో దాచుకుంటున్నావా? లేదా? పైగా నాభోగాలకంటావు! ఒరే కాస్త తల పయికెత్తి చూడు! మంచుతెరలాగ పట్టిందే బూజు. ఆర్నెల్లకోకసారైనా దులపగూడదట్రా? చూడు!

పట్టవగశే అగబ్బిలాలు ఎలా వచార్లు కొడుతున్నారో?
నీవేమో అత్తరు పన్నీరు వాసనలతో మునిగి తేల్తూఉంటే
నేనేమో, ఈగబ్బిలాల పెంటవాసనలలోనా? నీయిల్లేమో
రాజస్థానంలాగ పాలగచ్చుతో నిగనిగలాడుతుంటే, నా
దేవాలయం గడ్డిమొక్కలతోను, చీమల పుట్టలతోను,
సాలీళ్ళ గూళ్ళతోను, బూజు తెరలతోనూ నిండి ఉండాలి?
ఇదేగాదుట్రా నాభోగం!

అర్చ:- స్వామీ! మీరే అలా అనుకుంటే ఇక మాబోటివాళ్ల
సంగతి యేంజెప్పాలి! ఇవాళ ఇంట్లో, రేపు మంట్లో! ఏం
శాశ్వతం! తుచ్ఛమైన యీ సుఖాలకు మీరుకూడా తాప
త్రయ పడటమా!

దేవు:- చెప్పటమేగాని, అశాశ్వతసుఖాలు నీవుమటుకు విడవ
గూడదట్రా! నీకేమీ లోపం ఉండగూడదేం? నా తలం
బ్రాలమంటపం నీకు వంటచెరుకు పెట్టుకోటానికా! నా
వాహనాలకొట్టు నీకు గొడ్డు, గోదా కట్టేసుకోటానికా?
నా సామానులగది నీకు విశ్రాంతిభవనమా! నా గర్భా
లయం నీ యినప్పెట్టె దాచిపెట్టుకోటానికా? నా శంఖాలు
చామరాలు, గంటలూ, నీ పిల్లలు ఆడుకోటానికా?
ఏదిరా నీవు వదలిపెట్టిన తుచ్ఛసుఖం! ఊరేగింపుకని
బయల్దేరితే నాకంటే ముందుగానే నీవు రథమెక్కడమా!
మంచిమంచి గుడ్డలన్నీ నీవు కాజేసి ఎందుకూ పనికిరాని
పీలీగుడ్డలు నాకా? ఇంతద్రోహంచేసి, నాసొమ్ము తింటు
న్నావు. రౌరవాది నరకాలపాలవుతావురా!

అర్చ:- మీ సొమ్ము నేనేం తింటున్నానని అంతకోపం స్వామీ! ప్రొద్దస్తమానమూ మీకు అడ్డమైనచాకిరీ చెయ్యడమూనూ, తిండికి గూడా సరిగ్గా గడవక యేదో యింత వైద్యమో వల్లకాడో చేసుకొని బతుకుతూఉంటే నా సొమ్ము నా సొమ్ము అంటారేమిటండీ ?

దేవు:- ఆమాటకొస్తేమటుకు ఆ మందూ మాకూ ఎట్లా చేస్తున్నావో నేనెరగనా అంట! కురువులకనీ దురదలకనీ నీ వుపయోగించే శేర్లకు శేర్ల హారతికర్పూరం నా ఊరేగింపులకు వచ్చిందిగాదురా? అసవాలనీ అరిష్టాలనీ నీ వొండే తైలాలన్నీ నాకొచ్చే, బెల్లం ఖర్జూరకాయలు మొదలైనవాటితో గాదురా! అల్లుళ్ళకూ, కూతుళ్ళకూ నీవు పంపే సుగంధనూనెలన్నీ నాతోటలోని పూలతోటె గాదురా? డబ్బియ్యనివాడికి పెట్టే మట్టిఉండలు సైతం నా గుళ్లోమట్టిగాదురా? ఆఖరుకు చచ్చేవాడిగొంతులో పోసే ఆ తులిసినీళ్ళైనా నా బావిలోవేగాదట్రా! ఎవరెరగని వైద్యంరా నీది? ఊళ్లో పెద్దా చిన్నా అయినా ఏమన్నా అంటారని భయంకూడా లేదుట్రా?

అర్చ:- పెద్దాలేదూ చిన్నాలేదూ! ఆ దేవాదాయసంఘాన్ని కాస్త కనిపెట్టి ఉంటేసరి ఏంజేసినా చెయ్యకపోయినా ఎట్టి ఇబ్బందులూ ఉండవు. ఇంకా వెనకటికాలమే అనుకుంటున్నారు కాబోలు. ఏదో పెట్టినంతలో కలో అంబలో తిని సుఖంగా పడిఉండక ఎందుకీ లాయిలాస అనవసరంగా!

దేవు:- ఏమిరా! వేలకువేలు ఆదాయమొచ్చే నేను కలోలంబలో తాగి ఊరుకోవాలి? నీవేమో జమీందారుబిడ్డకు మల్లె నా ఐశ్వర్యమంతా అనుభవించాలి! ఏమిరా నీరోజులు!!

అర్చ:- అవునండీ! కొన్నాళ్ళు మీరోజులు. కొన్నాళ్ళు మారోజులునూ. 'వైద్యో నారాయణో హరి' అని శాస్త్రంలోనే చెప్పిఉంది. కాబట్టి మీరెంతో నేనూఅంతే. ఇకనైనా ఫూరుకోండి. ఇప్పటికే చాలా ఆలస్యమైంది. పోతున్నా పనుంది నాకు.

# ప్రణయకోపము - ప్రళయరూపము

[అదో సామాన్యమైన పడకగది. సమయం రాత్రి పదిగంటలు అతడు కోతలరాయుడు. ఉన్నా లేకపోయినా దర్జా వెలిగించాలనేపటం. ఆమె సాధ్వి. నిరాడంబరురాలు. కల్లాకపట మెరుగని యిల్లాలు. పెళ్లానికి తనదర్జా చూపించి మెప్పుపొందాలనే ఉద్దేశం అతగాడికి. అందులో మంచీ చెడ్డా తెలియని ధోరణిలో సాగిస్తాడు ప్రసంగం.]

భర్త:- నీవొక లెక్క అనుకుంటున్నావుగాబోలు. ఆ బజారున ఉన్న ఓఅమ్మాయి నన్ను చూడంది బతకలేనంటూా వెంబడి పడుతుంది ఆబజారున కెళ్ళానంటే.

భార్య:- మీాషోకుచూచి కాబోలునండీ !

భర్త:- ఆమాటకొస్తే నన్ను మించిన షోకిలామటుకు యెవదున్నారు! కేవలం షోకు ఒక్కటుంటేవాటుకు ఏమయ్యేటట్టు? అదొక జాతకప్రభావం. తూర్పు బజారువాళ్ళందరూ నేనంటే ప్రాణాలువిడుస్తారు. నేనొక శతకోటి మన్మధతుల్యుణ్ణి. యేమనుకుంటున్నావో యేమో !

భార్య:- ఓహో అలాటండీ ! అయితే మరి ఆ అందం నాకు కనబడదేమండీ ! నాకూ కళ్లున్నయిగా !!

భర్త:- కోకికిస్కా. నీ ఒక్కదానికి కనబడకపోతే నాకో తక్కువ అనుకున్నావా యేంటి? ఎంతటి అందగాణ్ణి, రసికుణ్ణి - ప్రజ్ఞాశాలిన్నీ కాకపోతే రోజాకుగోజా నచ్చె యి

వందలూ వేలూ ప్రేమలేఖల సంగతేమంటావు ? ఎందుకో తెలుసునా ! "మామకీన సౌందర్యసమ్మాశ్రయమునకు."

భార్య:- కవిత్వంగా బయలుదేరుతున్నదే చివరకు! ఉబ్బో!!

భర్త:- ఒక కవిత్వమేమిటి, ఒక గానమేమిటి ...... అసలు మనలో లేంది యేముందో చెప్పు? మొన్న కాకినాడనుంచి వచ్చిన వుత్తరంజూశావుగదూ! ఒక అమ్మాయిట. భర్త ఒట్టి దద్దమ్మట. పైగా రోగిష్టిట. అంచేత అతనిపేరవున్న ఆ స్త్రియావత్తూ తనపేర పెట్టించుకున్నదట. ఉన్న రొక్కం యావత్తూ తీసికొనివచ్చి నాదగ్గర్నే యేసంగీతమో, కవిత్వమో చెప్పించుకుంటూ ఉండిపోతుందట. వెంటనే జవాబు రాయాలట.

భార్య:-ఆలస్యానికి ఆఅమ్మాయి ఓర్చుకుంటుందో లేదో పాపం, రమ్మని రాయలేకపోయినారు. ఎందుకొచ్చినట్టు ఈగోల!

భర్త:- గోలయేమిటి? నిన్న బందరునుంచి ఒక ఉత్తరం! నాపేరు విన్నదగ్గరనుండి తనను నూదంటురాయిలాగ ఆకర్షిస్తున్నదట. తల్లిదండ్రులుకూడా ఒప్పుకున్నారట. రెండు మూడు రోజుల్లో మంచిరోజు చూసుకొని మన పాదాల దగ్గిర వాలటానికి సిద్ధంగా ఉన్నదట!

భార్య:- యేమిటండీ యీ వెధవపురాణం ! పుణ్యమా పురుషార్థమా? ఇఖ మానేద్దురూ వినలేక చచ్చిపోతున్నాను.

భర్త :- ఓహోహో ! మానెయ్యటానికి నేనేం బూటకాలు చెవుతున్నాననుకుంటున్నావా యేమిటి ? జరుగుతున్నవే

గదా ? నాదేముంది ? ఇదిగో ఇటుచూడు ! ఇవ్వాళే నెల్లూరినుంచి ఒక ఉత్తరం. బాగా చదువుతున్నదట ! మంచి అందగత్తెట. ఓ పదివేలరొక్కంతో ఈ ఉదయం రైల్లో బయలుదేరుతున్నదట. తెల్లవారేటప్పటికి వస్తుం దట. నా పాదసేవచేస్తూ ఇక్కడేఉంటుందిట, ఆ తెచ్చింది కాస్తా నాకు యిచ్చేసి.

భార్య:- ఈ పిచ్చికి మందు లేనట్లుంది ! యేమిటీ అతివాగుడు?

భర్త:- ఇది వాగుడా ? ఉన్న సంగతి చెప్తుంటేను. అంతదూర మెందుకు. ఇవ్వాళప్రొద్దున ఓ ఉత్తరం......

భార్య:- అబ్బా నాకు నిద్దరవస్తున్నదండీ ! రేపు చెబుదురుగాని లెండి. ఇవ్వాళకు ఇంతటచాలింతురూ పుణ్యముంటుంది!

భర్త:- అదిగాదోయ్ ... ఊ... ఇటుచూడూ ! ఇదిగో... ఆ...అప్పుడే నిద్దరపట్టిందా యేమిటి ? (పరీక్షించిచూసి) నిజంగా అప్పుడే కునుకేసిందే ! ప్లూర్ క్రీచర్!! ఈరకం గానే ఇంకా నాల్గురోజులు చెప్తేనేగాని మనదబ్బా దీనికి అంతుపట్టదు. అప్పటికిగాని మనమంటే ఓలక్ష్యంకుదరదు. ఇప్పటికి చాలా డంగయిపోయి ఉంటుంది. యేదో డాబు కోసం తంటాలు పడొద్దూ మరి ! పొద్దుపోయింది పడుకుం టాను నేనూను.

[మరి కొన్నిరోజులతర్వాత, అదేసమయం. అదే పడకగది. భర్త ధోరణి గ్రహించింది. కుక్కకాటుకు చెప్పుదెబ్బగా బుద్ధిచెప్పాలనుకుంది భార్య. ఇఖసాగించింది తన ప్రసంగం.]

భార్య:- మావూళ్లో ఉన్నాడే ఆ నంబిఅయన. అయనకట నే నంటే నట అమిత ప్రేమట. నేను తమలపాకులు చుట్టి యిస్తుంటే నా దగ్గరగా కూచుని చెరిగిపోయిన నా ముంగు రులు దిద్దుతూ కాలంగడపాలని ఆయనకు ఎంతో సరదాగా ఉంటుందట.

భర్త:- ఆరి పీడిదుంప తెగ! యెంతదుర్మార్గప్పు ముండాకొడుకు! పగలగొయించకపోయినావ్పూరీవాళ్ళతో చెప్పిరోగంకుదిరేది?

భార్య:- మాయింటి వెనక వున్నాడే ఆ గిరిరావు, అతగాడి కట, నన్ను చూడందె ప్రాణంనిలవదట. పొద్దస్తమానమూ నామీదే ప్రాణం పెట్టుకోని ఉంటాట్ట.

భర్త:- వదలకపోయినాడు ప్రాణాలు. అంతనిలవని ప్రాణాలు ఉంచుకోడమెందుకు ? ఈరోజుల్లోనే ప్రతిముండాకొడుక్కీ యిదో రోగంఅయిపోయింది, పళ్ళూయిదాన్ని చూస్తే సరి!

భార్య:- కంసలి కామయ్య ఉన్నాడే, అతనట, మంచి మంచి సొమ్ములు చాలా చేశాట్ట! అవన్నీ నాకుతగిలించి, నన్నో బంగారం బొమ్మనుజేసి నాసౌందర్యసముద్రంలో ఈదులా డాలని ఉందిట. అలాంటిదివిషం రాకపోతే బతికిమటుకు యేం లాభం అనుకుంటాట్ట!

భర్త:- అంత బతికి లాభంలేదనుకున్నవాడు చావరాదూ! లోకం గొడ్డుపోతుందా ఇలాంటి సన్నాసులు చస్తేమటుకు? వీడేదో శాస్త్ర మంచివాడనుకున్నాను వీడికీపుట్టిందిఈజబ్బు! ఆరి ముండాకొడకా!!

భార్య:- పాపం ఇంకా వీళ్ళు నయంగాదూ చాలామటుకు; ఆ పురోహితుడు పుల్లయ్య ఉన్నాడే, అతగాడికట, అడదిక్కెవ్వరూ లేకపోగా, నా అనేవాళ్ళుకూడా ఎవరూ లేరట, అంచేత నేనుగనక రావటానికి ఒప్పుకుంటే, అతనికున్న ఆస్తి యావతూ నాపేర రాసేస్తాట్ట! ఇక్కడ ఉండటానికి ఇష్టంలేకపోతే, యేబస్తీకో లేచిపోదామని అంటున్నాడు.

భర్త:- అరిపీడెమ్మకడుపుకాల! నాకెందుకు చెప్పలేదు? పుండాకోరును డొక్కచీల్చి డోలుకట్టించేవాణ్ణే! బతకటం యిష్టంలేదా యేంటి యీ వెధవకు, నాతోనే విరోధం! చూసుకో యేంచేస్తానో.

భార్య:- అప్పుడే యేమయింది! ఆ సంతులు తిమ్మారావు కంటే ఇతను ఎన్నోరెట్లు మంచివాడుగదూ!

భర్త:- ఏమిటి? ఆవెధవకూడానా యేంటి? యేంజరిగింది?

భార్య:- యేంజరక్క యేమయింది! అతను నిన్న మనింటి కొచ్చాడు. మీరులేరని తెలుసుకున్నాడో యేమో, మొదలుపెట్టాడు. ఎన్నాళ్ళనుంచో నాకోసం కాచుకొని ఉన్నాట్ట! దొరికిన యీ ఛాన్సుకు నేను ఒప్పుకోకపోతే, ఉరిపెట్టుకొని మనింట్లోనో చస్తాడుట. అమీ తుమీ తేల్చమని చాలా బలవంతంచేశాడు. అతని పరిస్థితి చూస్తే అన్నంత చేసేటట్లే కనబడ్డాడు. అంచేత నాకుకూడా జాలివేసి 'ఇప్పుడు వీలుగాదు. మాపటికి మీయింటికే వస్తాలే అని చెప్పి ఇంటికి పంపించాను. ఇంతలోనే మీరూ

వచ్చారు. యేదో ఆలోచనలో వెనకటివన్నీ జ్ఞాపకానికి వస్తున్నయి.

భర్త:- ఆ! ఆ!! నీకూపుట్టింది ఈ వాయవ! చీలుస్తాను, నరికేస్తాను, ఇలాంటిముండలు చస్తేనేం బతికితేనేం? అప్రతిష్ట ముండలు! (అని పైకిదూకి కొట్టబోవును. భార్య పెద్దగా అరచును. పురోహితుడు పుల్లయ్య ప్రవేసించును.)

పుల్ల:- అబ్బాయీ నరసింగరావూ! యేమిటిది? నిక్షేపంలాంటి భార్య నిలా చెండుకు తింటున్నావేం! నీకేంపిచ్చా! ఊరుకో నాయనా! ఊరుకో!

నరసిం:- ఓరి పుంఢాకోర్! నువుగాదుట్రా నాకొంపకింత చేటు దెచ్చింది? యేమీ యెరగనట్టు మాట్లాడుతావ్! చంపేస్తానుండు. (అని దూకును.)

పుల్ల:-చస్తిని! చస్తిని!! (అని అరచుచు బజారున పరుగెత్తును. నరసింగరావు వెంబడిబడును. ఇంతలో పంతులు ప్రవేశించి)

పంతులు:- నరసింగరావూ! ఏమిటీ గోల! నిష్కారణంగా ఎందుకు అతన్ని కొట్టడం. విడిచిపెట్టు. ఏమిటీ అసలుసంగతి?

నర:- ఓహో నువ్వురా! ఏమీ ఎరగనట్టు శ్రీరంగ నీతులు చెప్తావ్! అసలు నువ్వేగదరా ఇంతచేసింది! నిన్ను చంపేస్తే నాపీడ వదలుతుంది. (అని దబాదబా కొట్టును. ఇంతలో చాలామంది వచ్చి విడదీయుదురు.)

నర:- వదలండి! యీ వెధవల నిద్దర్నీ చంపేస్తేగాని నా పీడ వదలదు. ఎంత దుర్మార్గులనుకున్నారు వీళ్లు! అసలు యేం

జేశారో తెలుసా వీళ్లు! అవుల్లయ్య విధవేమో నాభార్యను లేచిరమ్మన్నాట్ట! యీ పంతులు తిమ్మయ్యేమో బలవం తాన పైనబడ్డాట్ట!

పుల్ల, పంతు:- (ఆశ్చర్యంతో) ఎవరు చెప్పారు మీకు?

నర:- ఎవరు జెప్పాలె! అదే చెప్పింది. ఏమే అంతేగదూ? నిజం చెప్పు! లేకపోతే నరికేస్తాను!

భార్య:- పాపం ఉత్తదేఅంతాను. వాళ్లు యేకర్మధర్మంపరగరు!

నర:-నిజంగా! అంతాఉత్తదే! అయితే అలా ఎందుకు చెప్పావు!

భార్య:- తప్పేముంది. మీరు రోజూ చెప్పేమాటలే. ఇవ్వాళ నేనూ చెప్పాను. ఏముంది ఇందుట్లో! ఎవరైనా డాబు కోసమేగా!!

భర్త:- ఆసినీతల్లిసిగదరగా! అంతాఉత్తదే! ఓసీభడవా! ఏదో నేను ప్రణయకోపంలో —

భార్య:- నాకుమటుకు యేందెలుసు ప్రణయకోపమే ఇలా ప్రళయరూపం దాలుస్తుందని?

భర్త:- పంతులూ, పుల్లయ్యా! క్షమించండి పొరపడ్డాను.

పంతులు, పుల్లయ్య:- క్షమించటానికేముందిగాని ఇకనైనా ఇలాగ అవకతవకలు ప్రేలక బుద్ధిగల్గి బతకండి! జాగ్రత్త!!

భర్త:-చిత్తం! చిత్తం!! అలాగే, మీ యిష్టంవచ్చినట్లే నడుచు కుంటాను. ఇక సెలవు. రావేపోదాం!

(అందరూ వెళ్ళుదురు)

జ్యోతిషము

శివం:- ఒరే కృష్ణా! జ్యోతిషం చెప్పడమంటే మాటలు కాద నుకో. అయితే వందలూ, వేలూ, పుస్తకాలు చదివిగూడా యేం లాభంలేదనుకో! అంతా ప్రపంచజ్ఞానం - ఒక్క ప్రపంచజ్ఞానంమీద ఆధారపడిఉంటుందిరా!

కృష్ణుడు:- అరే! అయితే ప్రపంచజ్ఞానం అందరికీ లేదంటావా? మరి అందరూ జ్యోతిషం చెప్పగల్గుతున్నారా? ఈరోజుల్లో—రాతతక్కువో, గీతతక్కువో గాని—తెలివితక్కువ వాడెరురా? మొన్నమటుకు మొన్న ఆ తహశీల్ దారుగారి ప్రమోషను వచ్చినఅంతమంది జ్యోతిష్కులలో ఎవడైనా చెప్పగలిగేడా! ఆ గౌరవం ఆబహుమానం నీకేదక్కుట మెందుకు? ఏదోవిశేషం ఉండాలిగా మరి!!

శివం:- ఉత్తది వట్టిది. విశేషంలేదు. పాడూలేదు. వాళ్ళంతా చదువుకున్నారన్న మాటేగాని — అసలుకు కావలసిన — ఆ ప్రపంచజ్ఞానం ఒక్కడికీ లేదనుకో! అంచేత వాళ్ళు అంత మందీ చెప్పలేంది మనం చెప్పగల్గేము.

అరే నిజానికి ఒక్కమాటచెప్తాను విను. ప్రపంచ జ్ఞానం ఒక్కటుంటే చాలురా! జాతకాలూ, గీతకాలూ, యావత్తూ ఓగంటలో నేర్చుకోవచ్చుననుకో, చెప్పేవా డుంటే! ఒక్క గంట! అంతేచాలు!! దాంతోటే రోజుకు ఓ నాలుగైదుకు తక్కువలేకుండా సంపాదించుకోవచ్చురా

కృష్ణ:- అరే దానిదుంపతెగ ! చిన్నప్పటినుంచి మనం ప్రాణస్నేహితులముగదా! ఆకిటుకు నాకుమటుకు చెప్పరాదుట్రా! నిరుద్యోగంలోపడి అల్లాడి చస్తున్నానని తెల్సికూడా ఇలా ఉపేక్ష చేయడం నీవంటి వాడికి తగునటరా ?

శివం:- అరే బ్రదర్ ! చాలామంది జ్యోతిష్కులు - చెపితే నేర్చుకొని మనకెక్కడ అడ్డం తగులుతారోనని సరిగ్గా చెప్పరురా ! అయితే మనం అలాంటివాళ్ళం కాదనుకో ! అడగంది చెపితే అంటదని, వాల్యూ ఉండదనీ, ఇన్నాళ్ళ నుంచీ నీకు చెప్పలేదుగానీ, నువ్వేం పరాయివాడివటరా ! సరే అడగనే అడిగావు! అంచేత ఈవాళే చెప్తాను కాచుకో!

కృష్ణ:-చెప్పరా, బాబూ చెప్పు! నీధర్మమాఅంటూ బ్రతుకుతాను!

శివం:- సరే విను. ముందు తాహశీల్దారు ప్రమోషను ఎలా చెప్పానో దాని తతంగం ఏమిటో చెప్పేస్తాను. అతను కుఱ్ఱవాడుగదా! పైగా అయిదారేండ్లనుంచి 'చాలామంచి వాడు' అనే పేరుతో పనిచేస్తున్నాడుగదా ! పైపెచ్చు సమర్ధుడుగదా? ఇవన్నీ అలావుంచి డిప్రెన్స్ కానుగదా!— మరీముఖ్యంగా — యుద్ధపురోజులుగదా! ఇలాంటి సందర్భాల్లో ఉన్న నాల్గుఖాళీలలో అతనికిమాత్రం ఒకటి ఎందుచేత రాదో ఆలోచించు!

కృష్ణ:- ఆరి నాబండపడా! ఇదంతా యెప్పుడు వాకబ్ చేశావురా? అయితే తెలియక అడుగుతాను, ప్రతివిషయానికి ఇంతదూరం వాకబు చెయ్యాల్సివస్తే పనితెములుతుందిరా?

శివం:- ఆ! అదిగో! అదే ప్రపంచజ్ఞానమంటే!! ప్రత్యేకంగా ఏదే వక్కాణ్ణి గురించో చెప్పాల్సివస్తే—ఇంతకంటే ఎక్కువ గానే వాకబు చెయ్యాల్సివుంటుంది ఒక్కొక్కప్పుడు! అయితే సర్వ సాధారణంగా, అందరికీ పనికివచ్చే సాధారణ పద్ధతికూడా ఒకటుంది.

కృష్ణ:- అయితే సాధారణపద్ధతీ, అసాధారణపద్ధతీ అంటూ రెండు ఉన్నాయా? అయితే ఏదీ అసాధారణపద్ధతి చెప్పూ ఎల్లా ఉంటుందో?

శివం:- ఇది చాలాముఖ్యంకూడాను. జాగ్రత్తగా విను. అసలు జ్యోతిషం అంటూ చెప్పాల్సివస్తే మనమంటే ఓ గురు భావం ఉన్నవాడికే చెప్పాలి. అది ముందుగానే ఉండాలి. అలాలేకపోయిందో, మనం అవుననన్నది వాడు కాదనడం-మనం కాదన్నది వాడు అవుననడం—దాంతో అనవసరంగా తర్జన భర్జనలు జరగడం—మన బండారం బయటపడడం—ఇలాంటి ఇబ్బందులు జరగొచ్చు; అంచేత ముందు జాగ్రత్త ఎందుకైనా మంచిది.

కృష్ణ- అవునురోయ్! అదీనిజమే సుమా! తరవాత!

శివం:- ఆతరవాత, మనం బాగా చదువుకున్నవాళ్ళ అయినట్టూ, చాలా దేశాలు తిరిగినట్టు, చాలామంది గొప్ప గొప్పవాళ్లకు జ్యోతిషం చెప్పినట్టు, దానికి వాళ్లు వందలూ వేలూ ఇచ్చినట్టు, ఏదో లోకంకోసం తాను ఇలా ప్రచారం

చేస్తున్నట్టూ, యేవేవో - వీలయినంతవరకు—మన ప్రజ్ఞలు చెప్పి వాణ్ణి డంగైపోయ్యేటట్టు చెయ్యాలి.

కృష్ణ:- నిజమే సుమీ? అలా చెప్పేవాళ్ళను చాలామందిని చూస్తూనే ఉన్నాముగదరా రోజూనూ!

శివం:- నిజానికంతేరా! యేదో వెనకటివాళ్ళు ఆత్మభూషణ పనికిరాదన్నారు గాని తెలియక, ఈరోజుల్లో అది పనికి రాదూ అంటాను నేను. మనవిషయం—మనమూ చెప్పుకోకపోతే పరాయివాడికి ఎలా తెలుస్తుందంటాను! అంచేత ఓపికఉన్నంతవరకు తన్నుగురించి చెప్పుకోవాల్సిందే!

కృష్ణ:- అసలు విషయం వదిలిపోతున్నావురా భాయీ!

శివం:- వస్తున్నా! తొందరపడకు! అవన్నీ అయిపోయిన తర్వాత మొట్టమొదటగా — అడిగేవాళ్ళందరకూగూడా— పుట్టిన తేదీలు చెపుతుండాలి. ఆ చెప్పటంలో కూడా — ఓ చిన్నగమ్మత్తుంది. సాధారణంగా వాడి కెన్నేళ్ళు ఉంటయ్యో ఊహించాలి. అంతగా తెలియకపోతే, పక్కవాణ్ణి అడిగైనాసరే — ముందుగా తెలుసుకోని ఉండాలి. ఇంగ్లీషుచదువుకొన్నట్లుండి, కాస్త ఫాషన్‌గా కనపడ్డాడా, ఫలానాసంవత్సరం వైశాఖ బహుళ షష్ఠీ అని తెలుగుతిథిలో చెప్పాలి. లేక కాస్త ఛాందసంగా కనబడ్డాడా, ఇన్నోసంవత్సరం జూన్ పదమూడో తేది అని ఇంగ్లీషుతారీఖు చెప్పాలి. ఆ చెప్పేటప్పుడుకూడా—జంకూ గొంకూ లేకుండా, తడుముకోకుండా, పైకి కిందికిచూస్తూ,

యేదో వేళ్ళులెక్కపెట్టినట్లు, నోటితో చదువుకొంటు న్నట్లూ, నటించి, చటుక్కున చెప్పివెయ్యాలి. అందు లోనే ఉంది తెలివియావత్తూనూ! తెలుస్తున్నదా?

కృష్ణ:- ఆ! ఆ!! తెలుస్తున్నది. చెప్పరాబాబూ, చెప్పు! నీ పుణ్యమెక్కడకు పోతుంది?

శివం:- ఈ దెబ్బతో నిజంగా వాడికి - మనమంటే చాలావరకు గురియేర్పడిపోతుంది. పోతే ఓచిన్నవిషయం గురుంచు కోవాలి! బాగా తెలుగువచ్చినవాడితో, ఇంగ్లీషులోనూ, తెలుగు బాగా మరిచిపోయి ఇంగ్లీషు వచ్చినవాడితో, తెలుగులోనూ, రెండూ వచ్చినవాడితో హిందీలోనూ, అదీయిదీ గాకపోతే అరవంలోనూ, సాధ్యమైనంతవరకూ మాట్లాడుతుండాలి.

కృష్ణ:- అంటే, నాకర్థంగాలేదురా! అలా ఎందుకుచేయాలి? అసలు అన్నిభాష తెలావస్తాయి?

శివం:- అందులోనేవుంది ప్రపంచజ్ఞానం. అంటే మనం చెప్పే దేంటో అవతలివాడికి స్పష్టంగా తెలియకూడదు. ఏదో మాటలగారడీచేసి వాడిచేత ఔననిపించాలిగాని నిజంచెప్పి ఎవణ్ణి మెప్పించగల్గుతాం ఈరోజుల్లో! ఇక అన్నిభాష తెలావస్తాయంటావు. అంతేగదూ! ముఖ్యమైనవి, అనేక అర్థాలు వచ్చేవి, భాషకు ఓయాభై మాటలు బట్టీ పెట్ట లేవుటోయ్! కాబట్టి అది అంత పెద్దచిక్కుగాదు! అయితే

వాడికికూడా అన్ని భాషలూ వచ్చినట్లుంటే, మనం జాగ్ర తగా తూకంగా మాట్లాడుతుండాలి.

కృష్ణ:- అవునురోయి! నిజమేసుమా! తరువాత?

శివం:- ఇక ఆతరువాతి; చిన్నతనంలో అంటే ఐదేండ్లవరకూ సుఖంగా పెరిగి ఉంటావు అని చెప్పొచ్చు. చిన్నతనంలో నిజానికి కష్టసుఖాలు ఎవడికి తెలుస్తయ్యి!. అయినా చిన్న తనంకాబట్టి వాడికి జ్ఞాపకంలేదనొచ్చు, అంతగా కాదంటే, అప్పుడప్పుడు చిన్న చిన్న జబ్బులు చేసిఉండాలి అనికూడా చెప్పొచ్చు. మరిదాను. ముఖాన కాల్చిన మచ్చొగిచ్చొ ఉందంటే, చిన్నబిడ్డనెప్పి వచ్చిఉంటుందని గూడా ఖచ్చి తంగా చెప్పొచ్చు.

అయిదు పది సంవత్సరాలమధ్య ఒక గొప్ప జబ్బు చేసి ఉంటుంది అని చెప్పాలి. సామాన్యంగా యేదో ఒహజబ్బు పదేళ్ళలో రాకుండా ఉంటుందా? అంతగా వాడు 'నాకు రాలేదే' అంటే నీకు జ్ఞాపకం లేదులే అనాలి. ఆరోజు ల్లోనే, ఓజలగండమో, అగ్నిగండమో, సమయాన్నిబట్టి రెండూనో, తప్పిఉంటయి అనవచ్చుగూడా! అర్థమవుతు న్నదా?

కృష్ణ:- ఆ! అవుతున్నదిరాబాబూ! ఆతరవాత?

శివం:- పది పహేను మధ్య కొన్ని కష్టాలు పడ్డావు అనాలి. అంటే అప్పుడే బాల్యం గడిచిపోయి, కొంచెం ఊహా తెలు స్తుండటం, చదువుకోమని తల్లిదండ్రులు ఒత్తిడిపెడుతూ

ఉండటం, ఏదో మొత్తంమీద కొంత గందరగోళంగా ఉండకపోదు. అపయిని పది హేను యిరవయి మధ్య స్త్రీ సంబంధమైనచిక్కులు కొన్ని వచ్చిఉండాలి అని చెప్పొచ్చు. ఎంచేతంటే, సాధారణంగా అప్పటికి పెండ్లాం కాపురానికి రాకపోవటంమూలాని, ఏదో లవ్ ఎఫెయిర్‌లో పడకుండా ఉండడుగా! కొంతమందికి నీకు రెండో సంబంధం అయి ఉండాలి అనొచ్చు. నిజంగా వాడికిగనక మొదటిపెళ్ళామే అయితే 'కాదండీ' అంటాడుగా వెంటనే. ఇక అప్పు డేమ నాలి? అదికాదోయ్! రెండోసంబంధమంటే యే ముండో ముతకో అని అర్థం చెప్పాలి. వాడు అదీకాదంటే అయితే ఆయోగం తప్పిపోయి ఉండాలి అనొచ్చు.

ఇరవయి ముప్ఫయ్యి, మధ్యజీవితం, చాలా ఒడిదుడు కులతో నడిచింది అనాలి. అంటే, అప్పుడే పెళ్లాం కాపరానికి వచ్చిఉండటం, అప్పుడప్పుడే సంపాదనలోకి దిగుతుండటం, తెచ్చింది చాలకపోవటం, చాలినంత తేలేకపోవటం, ఎడ్జెస్టు మెంటు తెలియకా డాబుకోసం, అనవసరఖర్చులు చేయడం, కొత్తబాకీలు పుట్టకపోవడం, పాతబాకీలు ప్రాణంతీస్తూఉండటం అంతా చిక్కుచిక్కుగా వుంటుందిగా.

ఇలా క్రమక్రమంగా అన్నీ దశలు దశలుగా కల్పించి, వాడి వయస్సువరకూ, యేదో చెప్పుకుంటూరావాలి. ఆ తర వాత, ముందు ముందు మంచిదశ వస్తుందనీ, చాలా సుఖ పడతావనీ, డబ్బూగిబ్బూ బాగా ఉంటుందనీ, మంచి పేరొస్తుం

దనీ, యిష్టం వచ్చినట్లు కొయ్యాలి. ఇంకా లాటరీ, రేసులలో, గెలుపులో, ఉద్యోగంలో ప్రమోషనో, యేవారసత్వమో, వచ్చివస్తుంది. కాని కొద్దిగా ఆలస్యమనీ, అవసరమైతే ఈశ్వరుడికో, దుర్గకో పూజలు చేయమనికూడా చెప్పొచ్చు.

కృష్ణ:- అరకంగా నయినా శాస్త్ర బాగుపడతాడు.

శివం:- ఇక సంతానం. ఇదే చాలా జాగ్రత్తగా చెప్పాల్సిన విషయం. ఒకరో యిద్దరో పోయిఉంటారు అనొచ్చు. వాళ్లు కాదంటే, బహుశా నీకు తెలిసి ఉండదులే, ఏదో గర్భస్రావం అయి ఉంటుంది, అనొచ్చు. మొత్తంమీద దరిద్రుడైతే ఒకరిద్దర్ని ఎక్కువగాను, భాగ్యవంతుడైతే ఒకరిద్దరే అని, చెప్పాలి.

కృష్ణ:- అరే, అసలు లేకపోతేనో?

శివం:- యోగం ముందున్నదనీ, ముందు ముందు కలగొచ్చు ననీ చెప్పు! జరిగినదంతా కష్టాలుగానూ, జరగబొయ్యే దంతా సుఖంగానూ ఉంటుందనాలి. ఎందుకంటే కానిన దేశమైన యీ భారత దేశంలో నిజంగా యెవడు సుఖపడి వుంటాడు చెప్పు! వింటున్నావా?

కృష్ణ:- ఊపిరి బిగబట్టిమరీ వింటున్నా. నీఋణం ఉంచుకోనులే చెప్పరా బ్రదర్ చెప్పు!!

శివం:- ఇంతదూరం చెప్పేటప్పటికి ప్రతివాడూ అనేవిషయమే అది. అలాఅన్నవాడు యేనాలుగోమూడో తగలెయ్యేడూ!

తరవాత, ఆయుర్దాయం మట్టుకు డెబ్భయికి యెనభయికి తగ్గకుండామాత్రం చెపుతుండాలి. ముందే వాడు దిగులు పడి చావకుండా. అయితే ఈమధ్యలో ఒకటి రెండుగణ్డాలున్నయ్యనీ, కాని అవి తప్పిపోవచ్చుననీ, చెప్పవచ్చు కాస్త అనుమానంగా ఉన్నవాళ్ళ విషయంలో.

ఇన్నీ చెప్పింతర్వాత ఇంకా యేదనా అడుగుతాడనుకో, ఒక్క చిన్న నవ్వునవ్వి గుర్వాజ్ఞ లేదనో, టైము కాదనో, చెప్పి తప్పించుకోవాలి. అన్నవాళ్ళకల్లా చెప్పనే కూడదు. ఆచెప్పేవాళ్ళతోనైనా చాలా రిజర్వ్గా ఉండాలి.

కృష్ణః- అరే, శివం ఈరకంగా చెపితే అన్నీ నిజమవుతాయంటావా ?

శివం:-అన్నీ నిజంగాకపోయినా ఫర్వాలేదు. పార్వతీదేవి శాపం ఉన్నదని చెప్పి, తప్పించుకోవచ్చు. కొన్ని ఎట్లాగూ రైటుగాకపోవుగదా ?

కృష్ణః- అయితే అందరు చెప్పేదీ ఇంతేనంటావా?

## పేరుకోసం

[ అదో పెద్దగది, గోడలనిండా పెద్ద పెద్ద బొమ్మలు, ఒకటి రెండు ఆఫీసు క్యాలెండర్లు, నిలువుటద్దాలు. నాలుగైదు సినిమా తారల క్లోజప్ నగ్నచిత్రాలు, అక్కడక్కడ తగిలించివుంచారు. అయిదారు కుర్చీలు - బల్లలు, యథాస్థానంలో అమర్చబడి వుంటయ్. పంకా గిర్రున తిరుగుతూనే వుంటుంది జమీందారుగారి మనస్సులాగా ! దీర్ఘాలోచనాపరుడైనట్లు నటిస్తూ, తలకాయ చేత్తో పట్టుకొని, కుర్చీలో కూచోని ఉంటాడు జమీందారు. ఆయన కెదురుగా పెద్దమనిషి పేరయ్య చేతులు కట్టుకొని జమీందారు నోటివైపు జూస్తూ నిలుచోని ఉంటాడు వాకిలికి దగ్గరగా. ]

జమీం:- (మరిచిపోయినట్లు) అయితే నువ్వెందుకొచ్చినట్లు ?

పెద్ద:- బాబయ్యా! ఆకా స్తసహాయం తమనల్లనే పొందాలని వచ్చానండి. చాలాకాలంనుంచి ఈపని మీవల్లనే అవుతుందని చాలా నమ్మకంగా ఉందండి! ఏదో మీవంటివాళ్ళు ఉండికూడా ఈమాత్రం సహాయం చెయ్యకపోతే, మాగతియేంగాను బాబూ! ఈ అనంతవిశ్వంలో ఊరు పేరు లేకుండా పడివుండటం కంటె ఆత్మహత్య చేసుకుంటేనే బాగుండునని అనిపిస్తుందండి ఒక్కొక్కప్పుడు!!

జమీం:- ఆత్మహత్యా! ఏమిటి ఇక్కణ్ణే చేసుకుంటావా ఏమిటి కొంపదీసి!! ఇందుకేనా ఏమిటి నాసహాయం గావాల్సింది? నేనేం హంతకుణ్ణనుకున్నావా, కసాయివాణ్ణనుకున్నావా ?

పెద్ద:- చిత్రం చిత్రం అదికాదండీ! ఏదో పేరుకోసం తమరు సహాయం చెయ్యాలండి! అంతేగాని నేనుమట్టుకు పిచ్చివాణ్ణాబాబూ పెళ్ళాం పిల్లల్ని వదలిపెట్టి నిష్కారణంగా ఆత్మహత్య చేసుకోటానికి?

జమీం:- అయితే ఏమిటోయ్ నీగోల!

పెద్ద:- ఏమీలేదండి! ఇదివరకు చాలాసార్లు తమ దర్శనానికి వచ్చానండి! ఒకప్పుడు జలసాలో ఉన్నారనీ, మరోప్పుడు రాజకీయాల్లో ఉన్నారనీ, ఇంకోఅప్పుడు యేదో చేస్తున్నారనీ యెన్నిసార్లు వచ్చినా తమ దర్శనమే కాలేదండి! ఏదో నా భాగ్యంకొద్దీ ఇవాళ తమ దర్శనం అయిందండి! అంచేత నాపని పూర్తవుతుందని నమ్మకమండీ!

జమీం:- ఏమిటాపని? తేల్చు తొందర్లో!

పెద్ద:-మీరు తలుచుకుంటే ఏమంత గొప్పపనికూడా కాదండీ! నిజంగా మీ ఘనతకు ఇదిఎంతలోదండి! మీనాయనగారేం, మీతాతగారేం, ఎంత ఉదారులండి! వారిపేరు చెపితేనే చాలు బాబయ్యా! పిల్లవాళ్ళుకూడా పాలుదాగటం మానేసేవాళ్ళండి! వాళ్ళెక్కడ, వాళ్ళ దర్జాయెక్కడ! అంత దూరమెందుకు! మీరుమటుకు సామాన్యులా! ఎంతఖర్చు ఏమి అట్టహాసం! ఒకటా రెండా చెప్పటానికి! అసలు యింతమాత్రపువాళ్లు మరోరున్నారండి యీరోజుల్లో! వంశం యావత్తూ పేరువిన్నదే! నేనెరగనండీ!

జమీంా:- ఇంతకీ పనియేమిటో చెప్పకుండా చంపేస్తున్నావే. అవతల నాకు చాలా పనుంది. ఏమిటో నీగోల తొందరగా ముగించు. పోవాలి.

పెద్ద:- అలాగేనండీ! దర్జా అంటే అదేనండీ! ఎలాగైనా సింహం సింహమే! "నక్కకూన కేలాఘటించు" చెప్పిన వాడేం వ్యర్థుడామరి!

జమీంా:- ఏమిటోయ్! నీవొచ్చిన పనికి తాడూ బోలా ఉందా లేదా ఇంతకు?

పెద్ద:- చిత్రం చిత్రం. మనవి చేస్తున్నానండి! ఈమధ్య రాజకోటలో ఠాకూరు సాహెబుగున్ను గారేలుగారిస్నీ ఒడంబడిక కుదరటంగున్నూ, ఆ ఒడంబడికనే కొద్దికాలానికి ఠాకూరు సాహెబు కాదనటం - దానిమీద గాంధిగారు పోయి, నిరసనదీక్ష పూనటం...

జమీంా:- ఆమీద రాజప్రతినిధి హామీ ఇవ్వడం, మారిస్ గ్వైరు తీర్పు, ఆతీర్పులో విషయం తేలక తికమకలు పడటమూ, కొంతకాలానికి గాంధీగారు ఆతీర్పు వదలుకోటం- ఈ జాతకంతా యెవడెరగంది, ఇప్పుడు యేకరువుపెట్టడం యెందుకు? నీ వొచ్చిన పనేమిటో నే చెయ్యాల్సినసాయం యేమిటో అది తేల్చుకోక, ఎందుకు ఈ ఊకదంపుడు?

పెద్ద:- ఆ! ఆ! అదేనండి బాబయ్యా!! ఏదో ఆలాగే మీరు సాయం చేస్తే నలుగురిలో నేనూ ఒకణ్ణవుతానండీ!

జమీంా:- నువ్వుచెప్పేదేమిటో నాకర్థంగావటంలేదు. ఆ రకంగా నే చేసేదేముందోయి! నన్నుకూడా ఎవరితోనయినా ఒడం బడిక చేసుకోమంటావా యేమిట?

పెద్ద:- అంతేనండి! ఆ చేసుకుండే ఒడంబడిక ఎవరితోనో కాకుండా నాతోనే చేసుకుంటే...

జమీంా:- (ఆశ్చర్యంగా) ఏమని?

పెద్ద:- ఏమీ లేదండీ! అంత ప్రమాదమైన సంగతైతే తమతో మనవి చేస్తానండి నా వ్యాపిరి పోతేమట్టుకు? ఏమిటంటే, ఇప్పుడు అన్ని సంస్థానాల్లోకూడా, స్వాతంత్ర్యంకోసమని, నానా అల్లరులు ఆగాలు జరుగుతున్నయ్యా, లేదా? ఆలాగే తమ సంస్థానంలో కూడా నానా గల్లంతులూ జరుగు తున్నట్లు—

జమీంా:- కుడిచి కూచోని కడుపు తెచ్చుకున్నట్లు, నిక్షేపం లాగా ఉన్న సంస్థానంలో, జాతర జరుగుతున్నట్లు ప్రక టించడమేమిటి? అసలా గోలేందే?

పెద్ద:- చిత్తం చిత్తం! నేమటుకు ఉందంటున్నానా? ఏదో లోకానికి తెలియటానికి అలా ప్రకటించకమూ - ఆ అందో ళన కంతటికీ నేను నాయకుణ్ణిగా ఉన్నట్టునూ, అంచేత నేను చెప్పినట్లు రాజ్యాంగ సంస్కరణలు యివ్వటానికి తాము ఒప్పుకొని నాతోనే ఒడంబడిక చేసుకున్నాట్లూ ప్రకటిం చాలి. ఆతరవాత.........

జమీందారు:- ఓరి నీ దుంపతెగ సహాయం సహాయం అంటూంటే ఇంకా యేమిటో అనుకుంటున్నాను! చివరకు నా కొంపకే యెసరు పెడుతున్నావే! నన్నేం నెత్తిన చెంగేసుకొని పొమ్మన్నావా యేంటి?

పెద్ద:- పాపము శమించుగాక! ఎంతమాట! బాబూ!! అలాంటిది యెప్పుడూ జరగదనుకోండి! పేరు రావాలనే ఒక్క కోరిక తప్ప ఇతరులను అన్యాయం చెయ్యాలనిగాని, అవమానించాలనిగాని నాకు లేదు. బాబయ్యా! అసలు విషయం పొంతంగా వింటే మీ అనుమానం తీరిపోతుందండీ! చిత్తగించండి!! అలా జరిగిన ఒడంబడికను మీరు ఉల్లంఘించటం! ఆమీద - రాజకోటలో గాంధిగారికి మల్లే, నేనుకూడా మీ సంస్థానంలో నిరశనదీక్ష పూనటం- దానితో కాంగ్రెసు మంత్రులు, గవర్నరులూ, రాజప్రతినిధి-యావన్మంది హామీ యివ్వటం మూలాన్ని నేను ఉపవాసం చాలించుకోవటం - చివరకు ఆ ఒడంబడికను, యే హైకోర్టు జడ్జిదగ్గరకో, తీర్పుకోసం పంపించటం, ఆయన నాకు అనుకూలముగా తీర్పు ఇవ్వడం-కొన్నాళ్లైనతర్వాత, నా ఉపవాసం హింసాపూరితం గాబట్టి, ఆతీర్పు వదలుకుంటున్నానంటూ, నేనొక స్టేటుమెంటు ఇయ్యటం-ఆ తర్వాత మీదారి మీది, నాదారి నాది. ఇది దీని అసలు మతలబు. అంతా రాజకోట - గాంధీగారు - ఎలా జరిగిందో అంతా అంతేననుకోండి! మీకుమట్టుకు యేమీ నష్టము

లేదు. ఇఖ పోతే, నాకుమట్టుకు ఫలానావాడు అబ్బాఎంత వాడురా అని పేరు వస్తుంది. ఆమీద ప్రభువు చిత్తం - దాసుని భాగ్యం!

జమీం:- ఆరి నీ కడుపుడకా! చివఱకు గాంధిగారిసంగతి ఇంత దూరం వచ్చిందా!! అయితే, నువ్వనుకున్నట్లు ఇదంతా జరుగుతుందనే నమ్మకం యెలాగోయ్! తీరా నువ్వు వుప వాసం పట్టిన తర్వాత - ఎవ్వరూ నీవిషయం పట్టించుకోక పోతే, అన్యాయంగా చచ్చిపూరుకుంటావే!

పెద్ద:- మనవి చేస్తానండి! మీకలాంటి సందేహామే అక్కర లేదు. వినండి! అంతగా నాఉపవాస విషయంలో ఎవ్వరూ జోక్యం పుచ్చుకోకపోతే, నాలుగోనాడో, అయిదోనాడో గుట్టుచప్పుడుగా - సుభాసుచంద్రుని రాజీనామావలె - ఉప వాసం మానేసి వెళ్తాను. అంతేగాని నిష్కారణంగా పెళ్లాం పిల్లలను వదలిపెట్టి చావటానికి సిద్ధమైనంత పిచ్చివాణ్ణిగాదు బాబయ్యా!

జమీం: సరే! నువ్వుచెప్పినట్లే అంతా జరుగుతుందనుకో! తీరా చివరకు నువ్వతీర్పు వదలుకోకపోతే నాగతి యేంగానూ!

పెద్ద:- అదీబాబయ్యా! ఆతీర్పును వదులుకున్నట్లు ముందుగానే రాసిస్తాను పుచ్చుకోండి! అసలు అంతదూర మెందుకండి! ఒక్క రహస్యం వినండి! గాంధిగారంతటివాడు - ఎనిమిది రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రుల బలం ఉండి, కొమ్ములు తిరిగిన మొనగాళ్ళ శిష్యబృందం ఉండి, చెప్పినట్లువినే

రాజప్రతినిధి ఉండి, ఇంత సరంజామా ఉండికూడా, రాజ కోటలో చింతాకంత సాధించలేకపొయ్యాడే! అలాంటిది ఈ వెధవ ఒక్క తీర్పులో, నావంటివాడివల్ల తమకు అయ్యే దేమిటి, పొయ్యే దేమిటి? కాబట్టి ఈవిషయములో మీరేం భయపడనక్కరలేదు బాబయ్యా!

జమీ:- ఏమోనబ్బా! ఇదంతా చాలా గందరగోళంగాఉందే? మరెవ్వరినైనా అడగలేకపొయ్యావు?

పెద్ద:- అడగకేమండి? నా తల వెంట్రుకలంతమందిని అడిగా నండి! కృష్ణాజిల్లాలో ఒకాయనండీ; "ఓరిబాబో! ఇవన్నీ నాకు తెలియవు. ఏదో జిల్లాబోర్డువ్యవహారాలైతే మనకు మంచినీళ్ళ ప్రాయంగాని ఈ రాజకీయాలు మనకంత బాగా తెలియవు. పైగా అసెంబ్లీ ఎన్నికలవల్లే నాతల బొప్పులుగట్టి పోయింది! కావాలంటే జిల్లాబోర్డులోఏదైనా ఒక ఛాన్సు చూస్తాను. అంతేగాని ఇతరం మనవల్ల కాదు బాబూ!" అన్నాడండీ!!

జమీ:- అయితే, వెనక మంత్రిగాకూడా ఉండి, జస్టిస్‌పక్షం నడిపి, పేరుతిన్నాడే ఓజమీందారు! మరి ఆయన్ను అడక్క పొయ్యావూ?

పెద్ద:- అడిగానండి! "నాయనా! ఆరాజకీయాలలో తిరిగితిరిగి నాతల వాచిపోయింది. అంచేత ఆ రంగాన్నుండి విరమించి, ఏదో ప్రశాంతంగా, మామూలు వ్యవసాయం చేసు కుంటూ ఉన్నాను. మళ్లా ఆగోలపిలో ఎందుకుదింపుతావు.

ఇలా బతకనియ్యి బాబూ" అని మొరపెట్టాడండి! ఇంకో ఆయన్ను అడిగానండి. "అయ్యా! మన కాగోడవే తెలియదు. ఒకరితో సంబంధం లేకుండా, ఏదో సినిమాలు పెట్టుకొని బతుకుతున్నాను. నీకు నిజంగా పేరే కావాల్సి ఉంటే సినిమాలో ఓ క్యారెక్టరు ఇప్పిస్తాను రా. అంతే గాని నా ప్రాణాలు పుచ్చుకోకు" అన్నాడండీ! అంచేత ఈ సాయం మీవల్లనే కావాలండి! మీకొచ్చిన ఫర్వాలేదండి! ఆలస్యం అమృతం విషమండి. మరి రాసుకుందామంటారా!

జమీం:- ఎకాయెకిని చెప్పటానికి వీల్లేదోయ్; ఇంట్లో మన వాళ్ళున్నారు. కనుక్కొని మరీచెపుతాను. అయినా ఇవాళ మంచిదికూడా కాదు. రేపొద్దున రా! చూతాం!

పెద్ద:- చిత్తం! సెలవుపుచ్చుకుంటా బాబయ్యా!

(తెరపడును.)

గుఱ్ఱబ్బండి

ప్రయాణమంటే నాకు మా చెడ్డసరదా. పనున్నా సరే లేకపోయినాసరే, ఒకరూపాయి చేతిలో ఉందంటే-సాగించా నన్నమాటే ప్రయాణం. నిజంగా అవసరమే వచ్చిందంటే యే చెంబో తప్పేలో అమ్మైనాసరే బయలుదేరుతాను. అసలు నాస్వభావం అలాంటిది.

చేబ్రోల్లో ఆనాడు నా మేనమామ బావమరది మరదలి అన్నప్రాశన. నలుగురితోపాటు నాకూ అందింది ఓ పచ్చు కార్డు. గుంటూరులో రైలుదిగి యేమోటారుకో పోదమనుకున్నాను. నాకర్మంకొద్దీ ఒకటి అప్పుడే పోయింది. రెండోది రిపేరులో ఉన్నది. చేసేదేమీలేక ఎట్లాపోవటమా అని ఆలోచిస్తూ దిక్కులు చూస్తూనిలబడ్డాను. నడవలేని యేమపుగా మరి! నన్నూ నావాలకం— చంకలోమూటా, చేతులో గొడుగు—చూచి వచ్చిపడ్డారు ఓపదిమంది గుఱ్ఱబ్బండిసాయెబులు. 'మారాజ్, వస్తారా వస్తారా' అంటూ. నాకు ఈ గుఱ్ఱబ్బండ్లూ అంటే—అందులోను సాయెబులవీ అంటేను— మొదట్నించీకూడా చాలాభయం. ఎందుకంటే, ఓమాటు మావాడూ నేనూ యిలాగానే బండెక్కిపోతున్నాం. ఆ పరుగులో బండి గుంటల్లోబడి గుద్దుకోటంలో, గోల్తాపడి విరుసు కాస్త విరిగి ఊరుకుంది. మావాడి కాలుకాస్త తొలిగి ఊరుకుంది. దీనికే ఒకచెంప ఇదవుతూంటే, 'ముందుడబ్బిచ్చి మరీ

కదల'మన్నాడు. విరుసు విరిగినందుకు చేసేదేముంది. చచ్చినట్లు—మాట్లాడితే దేహశుద్ధిగూడా చేస్తాడేమోనని భయపడి, మావాడి చేతిమురుగులు రెండూ అక్కడపెట్టి, మరి బయట పడ్డాం. అంచేత ఈ బండంటేనే అదోఇదిగా ఉంటుంది. ఈ వదిమందిని చూసేటప్పటికి ఈ సంగతి జ్ఞాపకంవచ్చిందికూడా. కాని అప్పట్లో మరోకారేదీ లేకపోవడంవల్ల వెంట పిల్లా పీచూ యెవ్వరూ లేకపోవడంవల్లా, ఎక్కడ వీలుదప్పితే అక్కణ్ణుంచే నడిచిపోదాం, మోటార్లుమటుకు ఇంతకంటె ఘనంగా యేడ్చినయ్యా' అని గుండె రాయిచేసుకొని, ఆ వస్తానన్నా. ఇహ చెప్పేదేముంది ? ఒక డొక్క రిక్కా, మరోక డింకో రిక్కా, ఇంకోడు చొక్కా, మరింకో యిద్దరు గొడుగూ, మూటా, పట్టి లాగడం మొదలెట్టారు.

'మారాజ్ నాది గంటకు పదిహేను మైళ్ళు పోతుంది' అని ఒకడు, 'నాకీమోటారుకంటే ముందు తీసికెళ్తా'నని మరోడూ, 'నాది యిమానం' 'నాది యగన్ పెస్' అని మరో కొందరూ, లాగుతూ నేఉన్నారు. నానాహంగామా చేస్తునే ఉన్నారు. 'ఎందుకోయ్ ! నన్ను ఇలాలాగుతారు ! నాకర్జంటు పనుంది. ఎవరిబండి ముందుపోతే ఆబండిఎక్కుతా!! నా ఒక్కడికే పోదుగదా ఏబండీకూడా, చూసుకోండి మరో యిద్దర్నో ముగ్గుర్నో' అన్నాను ఊపిరితిప్పుకోకుండా ఒక్కగుక్కలో. వెంటనే దానికీ తయారయ్యారు. 'నాకీ కాపీతింటానికి యీడకే పొయ్యారు ఇద్దరూ' అని ఓనల్లసాయెబూ, 'నాకీ ముగ్గురు యీకోట్లోనే ఉన్నార'ని ఓ బక్కసాయెబూ, 'మారాజ్ !

మాకీ మీఒక్కరికేపోతాం' అని ఓ మురికిగుడ్డలసాయెబూ, అనడం మొదలుపెట్టారు.

'నిజంగా సాయెబూ! నా ఒక్కడికే పోతావా ?'

'తల్లితోడండీ! మీకీ అబద్దం సెప్పుతానండీ పెద్ద మనుసుల్తో, అమ్మతోడండీ, రాత్తిరినుంచీ మేతలేక గుర్రం సచ్చిపోతాఉండాదండీ, రాండీ పోదాం అంటూ, ఆ మురికి గుడ్డలతను మరీలాగడం మొదలుపెట్టాడు. నిజంగా నా ఒక్కడికే పోనిచ్చేట్టు ఉన్నాడు. విశాలంగా కూచోనువచ్చూ, వెంటనే పోనూవచ్చు అని దీర్ఘంగా ఆలోచించిన మీదటనే సరేనన్నాను. వెంటనే గొడుగూ, మూటా, చటుక్కునలాగి బండిలోపెట్టాడు. 'ఎక్కండీ మహారాజ్! ఎల్లిపోదాం'అన్నాడు. 'ఆపితే దిగిపోతా సాయెబూ నీయిష్టం ! ఆనిక తగువులాడితే బాగుండదూ' అంటూనే బండెక్కాను. బండి ఓ పదిగజాలు పోనిచ్చాడో లేదో, హడ్లో హడ్లో మడ్సి, మీయిద్దర్కీ ఎల్లిపోతాగా' అంటూ బండినిలిపి సాయెబు దవ్వెత్తాడు. నాకు మాత్రం మనిషిజాడా ఎక్కడాకనపడలేదు. 'అయినా కరువు రోజులు. మన ఒక్కడికీ వస్తే మెట్లా, పోనీలేపావం! పిల్లా జెల్లా బతకొద్దూ' అని యేదోశాస్త్ర పావం తల్చాను బుద్ధి గడ్డి దిని. పదినిముషాలైంది. ఇరవై, అరగంట, గంట, అయింది. సాయెబు మాత్రం రాలేదు. కృష్ణా రామా అంటూ కూర్చు న్నాను. ఇంతలో మరో బండి చేబ్రోలు పొయ్యేది వస్తున్నది. ప్రాణాలు లేచి వచ్చాయి. అటూ యిటూ చూశాను. బండి వాడు గూడా కనపడ లేదు. మరీ మంచిదనుకొని, గొడుగూ

మూటా చంకబెట్టి దిగాను. శనిగాళ్లాగా ఆ బండిలోనించే దిగాడు ఈ బండివాడూను. ఊరుకున్నాడా 'ఏమండోయ్! పోతున్నారే' అన్నాడు. 'ఏం పోతే, నేను ఏది ముందుపోతే దాంట్లో పోతానని మొదట్లోనే చెప్పలేదుటోయ్!' అన్నాను. 'ఇంతసేపూ బండీలో కూకోని యెల్తే మాకే మాత్రం ఊరుకుంటామా హాండీ అన్నాడు ఇదో విధంగా. యాతావాతా చివరకు తేలిన విషయం యేమిటంటే, మరో పావలా ఎక్కువ యిచ్చేటట్టూ నా ఒక్కడికే బండి పోనిచ్చేట్టు, మధ్యవర్తులు తీర్చిన తీర్పుకు ఇద్దరం ఒప్పుకున్నాము.

సరే బండి బయలుదేరింది. ఆ గుర్రానికో పాపం అలవాటుట. నెట్టుకుంటూ, నెట్టుకుంటూ, ఓ అరఫర్లాంగు వెనక్కి రావటం, బండి విరిగేటట్టు ఓ పదితాపులు తన్నడం, ఓ యిరవై కొరడాదెబ్బలు తినడం, అప్పుడది దోవకురావడం, ఈ తతంగం యావత్తూ అయింది. ఒకఫర్లాంగు బాగానేపోయింది. సరిగ్గానే పోతుందిగదా ఇహ అనుకున్నాను. పోతూపోతూ చటుక్కున ఆగింది. "ఏయ్ పైకి పైకి" అంటూ వార్నింగిచ్చాడు. తగలేసినా తగలబడని లుంగీ, చేరెడైనా మంచి చోటులేక, ఏనెలకిందటనో ఉతికిన చొక్కా, ఎన్నాళ్ళకిందట నుంచో తైలసంపర్కం లేనందువల్ల గాలిలో వీరవిహారం చేస్తూ మొహంమీద పొరలాడుతున్న ఆ జుంజురుక్రాఫింగు, నాలుగైదు సార్లు, ముట్టించి ఆర్పిన బీడీముక్కా, చెప్పేదేముంది, తలపగిలిపోతున్నది వాసనకు. అంచేత దగ్గిరకుపోవడానికి ఇష్టమున్నా లేకపోయినా, వాడికేక లెక్కవయినందు

వల్ల పైకి జరక్క తప్పిందిగాదు. జరిగానో లేదో, 'వెనక్కు, వెనక్కు' అన్నాడు. ఇట్లా వెనక్కూ ముందుకూ జరగటమే గాని బండిమాత్రం బారెడుదూరమైనా కదలటంలేదు. గుర్రాన్ని బాదటం మొదలుపెట్టేడు. అదిమాత్రం ఊరుకున్నదీ! దెబ్బకో నాల్గుతన్నులచొప్పున బండిని విరగతన్నడం సాగించింది.

'అట్లా చూస్తావేం దయ్యంలాగు. దిగుదిగు, బండి కదలకపోవడం కనబడ్డంలేదూ నీకి' అన్నాడు మహాకోపంగా. అనడమే ఆలస్యంగా కిందికిదూకాను. బరువుతగ్గిందిగదా అనుకుందో, ఇహ ఎట్లాగూ ఊరుకోరనుకుందో, గుర్రం చావు పరుగు తీయడం మొదలుపెట్టింది. 'ఏయ్ భామ్మడూ! అట్లా నుంచుటాయేం గొడ్డాల! యెక్కు యెక్కు అన్నాడు. మాటలు ముదురుతున్నయ్యి! ఆలోచించుతూ ఉంటే ఇంకా యేమంటాడో, కానీ చూతాం అనుకొని ఊపుదెచ్చుకొని మరీ బండెక్కాను గబుక్కున. ఆ యెక్కడంలో వెనకబరువు యెక్కువయిందో యేంపాడో — మనం యెప్పుడన్నా చూశామా యేడ్చామా తెలియడానికి — బండిబండి యావత్తూ ఏతంకొయ్యలాగా పైకిలేచింది. నేనో బంతిమాదిరిగా దొర్లుకుంటూ దొర్లుకుంటూ పదిబారలదూరంలో పడటం, సిడిమానుకుగట్టిన మేకపిల్లలాగా బండితోపాటే పైకిలేచిన గుర్రం కట్టినత్రాళ్ళు తెగి తడాలున కిందపడటం, కనురెప్పపాటులో జరిగింది. ఇహచూసుకోండి. పడ్డందుకు నేనేం భయపడలా! ఈదెబ్బకు సాయెబు చంపుతాడనే భయపడ్డాను. కాని తీరా

పరకాయించి చూతునుగదా! గుర్రమేమో బండిచక్రాల మధ్యపడింది. ఎటు తప్పించుకోటానికి వీలులేక గిజగిజ తన్ను కుంటున్నది. సాయెబేమో ఎట్లాపడ్డాడేమో పాపం—గుర్రం కిందపడ్డాడు. బయటకురాలేక, సతమతం అవుతున్నాడు. సత్తవకొద్దీ, చావుకు తెంపుజేసి మరీ ప్రయత్నిస్తున్నాడు. ఊహూ! అంగుళంకూడా ఇవతలకు రాలేకపోయాడు. ఏని గంత గుర్రమాయెను, ఎట్లావచ్చేట్టుపాపం!, నోటిమాటలేదు పరిగదా ఊపిరికూడా సరిగా ఆడుతున్నట్టులేదు. జుట్టుమాత్రం కాస్త బయటకు కనబడుతున్నది. ఇహ కాసేపుఊరుకుంటే చాల్కు—చచ్చి ఊరుకుంటాడు. ఏమయితే అది అవుతుంది అని ధైర్యంజేసి, ఆజుట్టుపట్టుకున్నాను. ఎట్లాఅయితేనేం, చావు తెంపులమీద సాయెబును, ప్రాణాలతోటే బయటికీడ్చాను. ఆముండాకొడుకి వొళ్ళుయావత్తూ దోక్కుపోయింది కామాలు పాపం, నెత్తురువరదలు గారటం మొదలుపెట్టింది.

'నీబామ్మడుసావ! అట్టాలాగుతావేం! సూడు ఒళ్ళు యట్టాఅయిందో!' అని మటుకు ఊరుకున్నాడు. ఇదీ ఒక అదృష్టమే అనుకున్నాను.

అట్టాగే లేచాడు. గుర్రాన్ని లేవదీశాడు మళ్లా బండి సాగించాడు. కదిలితేగా ఆపాడుగుర్రం. 'అట్టా దయ్యంలాగ సూత్తావేం! నెట్టు నీబామ్మకుపడిసావ' అన్నాడు. తను గుర్రాన్నిబాదుతూ, ముందు లాగుతు సాయెబు బండిన్నక్క—నా, బండినినెకుతూ, వెనక నేనూ పరిగెత్తటం మొదలుపెడితిమి. ఎంతదూరమని పరుగెత్తగలం! అప్పటికే నోటమాటలేక,

చచ్చేటంత ఆయాసంవచ్చింది. ఛా నీమంపతెగ బండి! ఇహ లాభంలేదు, నడిచిపోదామనుకుంటూ ఉం డేటప్పటికే 'యేయ్ ఎక్క ఎక్క' అన్నాడు. అప్పటికి కాస్త గుర్రంగూడా దోవ కొచ్చినట్టుగానే ఉంది. దానికీ కాళ్ళవెంబడి సబ్బునురుగుతో పాటు రక్తంగూడా కాల్వలుగట్టింది పాపం అదిమటుకు ఎంత సేపు మకురుజేస్తుంది?

పరేనని తడాల్ను ఎక్కడంలో బండి టాపుతగిలి నాకు మొహం బొబ్బకట్టింది. బండి పాడూ ఎక్కాడు! వెంటనే గుర్రంమటుకు, టక్కున్న నించుంది. నన్ను దిగమన్నాడు. అతగాడు దిగాడు. ఇహ బాదడం మొదలుపెట్టాడు. గుర్రం సనేమంటుందే దానిదుంపతెగ. గుర్రంపోలేదన్న కోపం, బాడిగ రాలేదన్న కోపం, యావత్తూ నామీదపడ్డది. "ముందికీ అంటే మెనక్కిసస్తివి! మెనక్కీ అంటే ముందుకునస్తివి!! బండిలేచీ పోను! గుర్రం నడుమూాయిరిగే! నీకీ ఎట్టాపుట్టించాడురా ఆ భెమ్మ. సెంబోల్ పోతాట్ట మెద్వ మొహం నీకీ పొద్దున్నే మెవడి మొఖంసూశావుబే, నాకీ బాడిగా దొరకలేదు. సెంబోల్ మొహాం. సెంబోల్ పోతాట్ట! నీకీ ఎట్టాభతికావుబే అంత దెబ్బలోగూడా? గుర్రాన్ని సంపితివిగెందా? నీ భేమ్మడు పడి సావ! ఎద్దుముఖం! సావురా, సావు! సెంబోలుపోతాట్ట పాడు మొఖం "గుర్రం పొమ్మంటే మెట్టాపోతుంది ఎద్దుబరువు! పిల్లాజెల్లా నోటమట్టికొట్టావే!" అంటూ సాగించాడు.

మాటలుముదురుతున్నా ఊరుకున్నా, ఆ చుట్టుపక్కల గూడా మెవ్వరూలేరు. బదులుమాట్లాడితే పొగరుమోతు

ముండాకొడుకు. అదీగాక, చావుదెబ్బ తినీగూడా తప్పించుకున్నాను. ఆకోపంకొద్దీ యేంజేసినా చెయ్యొచ్చు' కానీలే శాంతం భూషణం అన్నారు పెద్దలు.' అని నేనే కాస్త తగ్గాను ఎందుకైనా మంచిదని.

ఎంతకొట్టినా గుర్రం కదిలేసూచనా లేదు. ఉన్నకొద్దీ సాయెబునోటికి అడ్డూ లేకుండా ఉన్నది. ఇహ లాభంలేదనుకొని 'ఏమండి సాయెబుగారు! ఇదిగో మీబాడిగ మీరు తీసుకోండి. దానిదుంపతెగలే. దాన్ని అట్లాకొట్టితేమటుకు యేం లాభం! ఊరుకోండి ఇహ' అని మర్యాదగా అనుకున్నదానికంటే మరోఅణా అధికంగానేయిచ్చి, చచ్చినట్లు నడిచివెళ్ళా పడమటి నాల్గుఘడియలకు.

ఆ వొళ్ళునొప్పులూ, ఆ దోకుడు చెక్కులూ, పోయి మళ్ళా మామూలుమనిషినయ్యేటప్పటికి బాగా ఒక నెలపట్టింది. ఇహ అప్పుడనుకున్నా బతికున్నంతవరకూ గుర్రబ్బండి యెక్కకూడదని.

మా పిల్లలు !

కిరసనాయిల్ కరువువల్ల పెందరాళే భోంచేసి పడుకున్నాను. ఇంతలో మా ఆవిడ—అవి యివీ సద్దుకొని—అధికారి దగ్గరకు జవానులాగా— నక్కుతూ దగ్గరకువచ్చింది. 'ఏమండీ దిండు పెట్టానా ? శాలువా ఇచ్చానా? మరచాను, నీళ్ళ చెంబు పెట్టలేదనుకుంటాను ! ఏమిటో వెధవమరుపు—ఎప్పుడూ ఒకటే మరుపు' అంటూ మొదలుపెట్టింది.

మనవల్ల ఏదైనా పనికావలసిఉన్నా, ఎక్కడికైనా వెళ్ళటానికి పర్మిషను కావలసియున్నా, కాస్తో కూస్తో డబ్బు కావలసిఉన్నా, యీ రకంగా లాలించడం మా ఆవిడకు బాగా అలవాటు. ఇది మనకూ తెలిసినవిషయమే కాబట్టి నాకట్టే ఆశ్చర్యం కలుగలేదు. కాని రేపటి డిమాండు ఏమైఉంటుందా, అది ఎలాతప్పించుకోటమా, అని ఆలోచిస్తూ ఆ, ఊ, లతో నెట్టుకొస్తున్నాను. అవతల వంటి వెధవ, సన్నసన్నంగా సంగీతం ఆలాపిస్తున్నాడు. అయినా వాణ్ణి లెఖ్ఖపెట్టకుండా 'వెధవ సంతానం, ఎప్పుడూ ఒకటే యేడుపు ! కాస్త కాళ్ళుపిసుకుదామన్నా వీలుండదు, పడవనియ్యండి, వెధవ యేడుపు ఎప్పుడూ ఉండేదేగా' అంటూ నాకాళ్ళు పిసకటానికి వచ్చింది. 'కాళ్లూ వద్దు, వేళ్ళూవద్దు ! కాస్త వాణ్ణి సముదాయిద్దూ ! కాస్త నిద్రబోవాలి ! అన్నాను తప్పించుకుండే యెత్తులో వెంటనే కుర్రాణ్ణో రెండు, తననో రెండూ తిట్టుకుంటూ కుర్రాణ్ణి సము

దాయిస్తూనే మంచంమీదికి వచ్చింది కాళ్లుపిసకటానికంటూ. అప్పుడనుకున్నాను రేపటి డిమాండు చాలా గొప్పదే ఉంటుం దనీ, ఎలాగూ తప్పదనీ. అంచేత దొంగనిద్ర నటించటం మొద లెట్టాను.

'ఇదిగో! ఏమండోయి!! అప్పుడే ఏం నిద్దరండీ! ప్రొద్దున్నాకూశ లేదు సరిగ్గా, ఇదిగో, ఇటుచూడండీ, మరే, రేపూ ... నిజానికి నాకూ మాట్లాడాలి అనే ఉంది గాని, తీరా వస్తే యేంకొంపమునుగుతుందో అని, సకల్లా బ్రహ్మాండం తలక్రిందులు చేసిన వాడికిమల్లే పెద్దశ్రమ నటిస్తూ పడుకున్నాను. అప్పట్లో అంతకన్నా మరోమార్గం కనిపించలా.

'ఇదిగో చూడండి! రేపు వైకుంఠఏకాదశి. మనవా ళ్ళందరూ, పొద్దున్నే గుళ్ళోకివెళ్తారుట. మరే నేనుగూడా వెళ్ళాలని ఉందండీ! ఏమంటారు! అంది.

ఇది వినేటప్పటికి ఇక దొంగనిద్ర నటించాల్సిన అవసరం కనిపించలా. ఎంతగా ఖర్చుపెట్టినా ఏ పావలాకన్నా ఎక్కువ గాదు. ఓ రెండుగంటలకన్నా టైమూ అక్కర్లేదు. అంచేత ధైర్యం తెచ్చుకొని, కప్పుకున్న శాలువా తీసివేశాను, పక్కకు తిరిగాను.

'ఏమంటావు! ఎప్పుడూ గుళ్లూగోపురాలేనా' అన్నాను.

'అదికాదండీ! నేనేం కాశీపోతానా రామేశ్వరం పోతానా? మళ్ళా ఓగంటలో వస్తామండి! ఏమంటారు!'

'ఏమంటానికేముందోయి! మహా చక్కంగా వెళ్ళు! ఈ భాగ్యానికింత దేవురించటంమెందుకు! ఇదిగాకపోతే, ఒకటి

మటుకు — నీవు అడగటం— నేను కాదంటమూనా! అన్నాను.'
అడిగింది లేదనకుండా యిచ్చే ధర్మాత్ముడిలాగా.

'అదికాదండీ! రేపు మీరే కాస్త......

'నన్ను గూడా రమ్మంటావా యేంటి! నాకుమటుకు వీలుగాదు. రేపొద్దున ఇన్స్పెక్టరుగారుగూడా వస్తాట్ట! నేను పెందరాళే వెళ్ళాలి అన్నాను తప్పించుకుండే ఎత్తులో.

'ఎబ్బే కాదండీ! కాస్త నేనువచ్చిందాకా, పిల్లల్ని చూస్తూఉండాలి.'

'సరి సరి! ఇంతమాత్రం చెయ్యలేమా యేంటె! పెద్దవాళ్ళే చూస్తాం ముందు' అంటూ పైకిలాక్కున్నాను.

'అబ్బా ఉండురూ కుర్రాణ్ణి కాస్త పడుకోబెట్టివస్తాను.' అంటూ లేచిపోయింది.

'ఏమండోయి! వెళ్లుతున్నా! పిల్లలు జాగ్రతసుమా అండి! అసలు పిల్లలు లేవనే లేవరు, ఒకవేళ లేచినా కాస్త సముదాయించండి. ఆచిన్నదాన్ని మటుకు కోప్పడబోకండీ, అది ఊరికెనే దడుచుకుంటుంది!' అంటూ తెల్లవారుజామున మా ఆవిడ గృహభారం యావత్తూ అప్పజెప్పి మరీ వెళ్ళింది. పిల్లల జాగ్రతఅంతా తనకే అయినట్లూ, నేనేమో వాళ్ళను కోప్పడి కొట్టానని, తానేమో అదివద్దని నాకు బుద్ధిచెప్పుతున్నట్లూ, చెప్పటం చూస్తే నాకు మరోలాగు అనిపించింది. మనంమటుకు పిల్లల మంచిచెడ్డలు చూస్తుండలేదా, మనకుమటుకు పిల్లల్ని సముదాయించడం చేతగాదా, యేమిటి దీని అభిప్రాయం. ముప్ఫయి నలభై మంది పిల్లలను— అందుట్లోను, పరాయిపిల్ల

లను, సంబాళించుకుంటూ పదిహేనేళ్ళ సర్వీసుచేసిన మనకు, అభం శుభం ఎరగని ఒకఆడది, పిల్లల జాగ్రతను గురించి మనకు చెప్పటమా! అదీగాక, రోజూ మనం బళ్ళోచేసేపని యేమిటి !

రానివాళ్ళను రప్పించాలి; వచ్చినవాళ్ళను అల్లరిచెయ్యకుండా, చూడాలి; అల్లరిచేసేవాళ్ళను సంబాళించుకోవాలి. యేడ్చేవాళ్ళను నవ్వించాలి; నవ్వేవాళ్ళకు పాఠాలుచెప్పాలి; ఒకటా రెండా ! శతావధానంమటుకు ఇంత కష్టమనిపిస్తుందా ? ఇలాంటి మనం, కేవలం, ముగ్గురుపిల్లల్ని—అందులోను స్వంత పిల్లల్ని—సంబాళించలేమనేగా దాని అభిప్రాయం ! కానీ చూదాం ! అవసరంవస్తే ఆడవాళ్ళకన్నా మనమే అతి జాగ్రతగా మానసిక శాస్త్రజ్ఞానాన్ని బట్టి, పిల్లలను కంట్రోలుచేయగలం అనే విషయాన్ని ఋజువుచేసి మా ఆవిడకు గర్వభంగం చెయ్యాలి అని నిశ్చయించుకున్నాను. సమయంకూడా రానే వచ్చింది. ఒకదెబ్బకు రెండుపక్షులన్నట్టు మా ఆవిడకు గర్వం భంగం—మన తెలివి ప్రదర్శించడం—జరిగించాలనుకోని, ఆ రెండుగంటలూ, రాష్ట్రీయగవర్న మెంటులో, హోండిపార్టు మెంటు నిర్వహించటానికి పూనుకున్నాను.

ఇంతలోనే పెద్దపిల్ల ఒంటేలుకంటూ లేచింది. దాన్ని లేవదీసి బయటకు తీసుకొచ్చేసరికి 'నీదగ్గరే పడుకుంటానాన్నా' అంటూ గారాబం చేసింది ! 'పోనీలే తెల్లవారవచ్చిందిగదా! అయినా మనం పడుకుంటే ఎలాపడుతుంది' అనుకొని సరే పడుకో అమ్మా అన్నాను.' నాకు అలవాటు లేకపోయినా

అంతా గుట్టుచప్పుడుగానే చేసాను. కాని ఎలా పసిపట్టిందో చిన్నపిల్ల అప్పుడే లేచి యేడ్వటం మొదలుపెట్టింది. 'ఎందు కమ్మా. ఎందుకు? ఏడవకు, వస్తున్నాగా' అంటూ లేవబోయే సరికి 'నాన్నా! నాకుభయమే! పడుకోవే' అని పెద్దది ధోవతి పట్టుకొని లాగడం సాగించింది.

'ఛా! నీదుంపతెగా! యేంభయం! నేనున్నాగా! పండుకో' అంటూ నేను చాలాగొప్పవాణ్ణని, నేనుండగా భయముండటానికి అవకాశంలేదనీ, అయినా తనను వదలిపెట్టి పోననీ, చిన్నదాన్ని గూడా తీసికొని, తనదగ్గిరకేవస్తానని, ఇంత అభిప్రాయం వచ్చేటట్లు, నాల్గుమాటల్లో, భావంయావత్తూ తెలిసేటట్టు చెప్పేశాను. ఇంతభావంగా, అరిటిపండు వొలిచి పెట్టినట్లు, ఉదాహరణపూర్వకంగా, చెప్పినా ఆపెద్దది వినదే. గుడ్డవదలిపెట్టదు. దీనికి అర్థంగాలేదు. పోనీలే దీన్ని యిబ్బంది పెట్టడం ఎందుకని, అమ్మా! ఇక్కడున్నారా! అని చిన్నదాన్నే పిలిచాను. అది రాలేదుసరిగదా! పంచమస్థాయిలో ఉన్న రోదనం, షడ్జమస్థాయికి చేరవేసింది. ఇది వదిలిపెట్టదు. అది రాదు. పట్టినపట్టు ఇద్దరూ విడవటంలేదు. పోనీలే ఇద్దర్నీ తృప్తి పరుద్దాం, ఈకాస్తలో పోయేదేమిటని, పెద్దదాన్ని ఎత్తుకొని చిన్న దానిదగ్గరకెళ్ళాను. బలవంతానా లాక్కుపోతున్నాననే భయం కొద్దీ పెద్దదిగూడా యేడవడం మొదలు పెట్టింది. సరే, దీనికి తప్పుఅభిప్రాయం తోచిఉంటుంది. ఆతరవాత 'ఇది నీమంచికే' అని నచ్చచెప్పవచ్చు, ముందు చిన్నదాన్ని సముదాయించడం ముఖ్యం అనుకొని, చిన్నదాన్ని ఎత్తుకోపోయాను. అది

రాలేదు సరిగదా, మంచానికి కరుచుకొని తన్నుకోటం మొదలు పెట్టింది. తేలూ, గీలూ, ఏదన్నా కుట్టిందేమో అనుకొని 'ఏం అమ్మా! ఏదన్నా కుట్టిందా' అన్నాను. దీనికీ జవాబులేదు. ముడతలుపడ్డ పక్క అటూ యిటూ సర్ది చూచాను. అంతో యింతో దీపంకూడా వెలుగుతూనే ఉంది. ఎక్కడా ఏం కని పించలేదు. ఎత్తుకుంటానంటే రాదు. ఏడుపు మానదు. ఏమిటా అని ఆలోచించాను. ఆరాత్రి పప్పు, పాడూ తిన్నారు కూడాను. అంచేత 'ఏం అమ్మా! కడుపులో నొప్పా! చెప్పమ్మా' అని బుజ్జగించాను. ఉలకదు. పలకదు. యేడుపు మానదు. మంచంలో బడి గిజగిజా తన్నుకుంటుంది. వెక్కి వెక్కి యేడ వటం మూలానో, మరి యేదన్నా బాధమూలానో కడుపు ఉబ్బుతున్న లక్షణాలుకూడా కనపడుతున్నయి. నాకుకూడా యేమీ తోచడంలేదు. ఏదో మొత్తంమీద పెద్దబాధమటుకు ఉన్నదనీ, అది వెల్లడించే నేర్పులేక, ఆబాధ భరించే ఓర్పులేకా; అలా తన్నుకుంటున్నదనీ, యేవిధంగానైనా దానిచేతనే చెప్పిం చాలనీ, కిండర్‌గార్డెన్ డైరెక్ట్ ... మొదలైన మెథడ్సలన్నీ— నాకు తెలిసినంతవరకూ ఉపయోగించాను. లాభంలేదు. ఏమైనా సరే, ఎప్పటికైనాసరే, తానుపడేబాధ చెప్పకతప్పదనీ, తాను చెప్పనంతకాలం మనమేమీ చెయ్యలేమనీ, వైద్యుడొచ్చినా తనబాధ చెప్పంది ఏమీ చెయ్యలేడనీ, మనం యజమానులం కాబట్టి తన సంగతి సందర్భాలు యావత్తూ మనద్వారానే జర గాల్సి ఉంటాయనీ నానావిధాలుగా నచ్చచెప్పి చూశాను.

ప్రయోజనం సున్నకున్న. హాళ్లికిహాళ్ళీ; యేడుపు మానదు. పొట్ట పగిలేటట్టుగూడా ఉంది.

ఇహ ఊరుకుంటే లాభం లేదనీ, ఇదేదో గొప్పబాధే అనీ, కాకపోతే పిల్ల మరీ అంత మెలికలు తిరిగిపోదనీ నిశ్చయించుకొని, పెద్దమ్మాయిని గబుక్కున కిందికి దించేసి, బలవంతాన చిన్నదాన్ని ఎత్తుకొని, 'ఊరుకో అమ్మా! ఊరుకో!' పోతుందిలే, అమ్మా అంటూ, అడుగులు వేస్తూ సముదాయించడం మొదలు పెట్టాను. అంతయేడుపుకూడా టక్కున మానేసింది. 'ఇప్పుడు పొమ్మనూ' అంటూ గూాలిగింది. 'ఏమిటమ్మా యేమిటి' అంటూ మళ్ళా బుజ్జగించాను.

'మరే - అక్కయ్యనే పొమ్మనూ' అంది.

'ఓసినీదుంపతెగా! ఇందుకా ఇంత అఘాయిత్యమూనూ! ఓసి మొద్దుముండా!! ఎంత జాతర చేశావే' అని ఆశ్చర్య పడ్డాను. మరి యీహడావుడికే, లేచాడో, మరి లేవాల్సే లేచాడో చిచ్చరపిడుగులాగా కెవ్వునకేకవేసి, లేచి యేడవటం మొదలెట్టాడు మన మహారాజశ్రీగారు. అసలు మనవాడు లేవకుండానే వుండాలిగాని, లేస్తేమటుకు ఊరుకుండేరకంగాదు. ఆతరవాత యేమనుకున్నా లాభంలేదు. అదీగాక, కాస్తచిన్నదాని యేడుపుకూడా తగ్గుతున్నది పోనీ దీన్నిదించి వాణ్ణెత్తుకుందామా అంటే, చిన్నదానికి ఎక్కు ఇంకా సద్దుకోలేదు; పైగా దించానాఅంటే, బలవంతానవినా హాత్య చేసుకుండే పాటిది అది. దాన్ని దించటానికీ వీలులేదు. వీణ్ణి ఎత్తుకోకుండా ఉండటానికీ వీలులేదు. ఇవన్నీ యోజించి, 'అమ్మా

కాస్త అబ్బాయిని ఎత్తుకోఅమ్మా’ అని పెద్దదానికి పురమాయించాను.

తనను దించానన్నకోపం, చిన్నదాన్ని ఎత్తుకున్నాననే ఈర్ష్యా, వీటికితోడు తను పనిచెయ్యాల్సిరావటం, అన్నీగల్సి ఆపెద్దది బావురుమన్నది.

‘అమ్మాయీ! ఒక్క పనేనువ్వు చెయ్యటానికి యేడుస్తావే! నేనుచూడూ ఎన్నిపనులు నద్దుకొస్తున్నానో! తలాఒకపని_ చేతయినంతమటుకే చెయ్యొద్దా! అలా చేసుకున్నందువల్లనే గదా రష్యా అంతవృద్ధిలోకి వచ్చింది! అంటూ సాంఘిక శక్తులూ, ఐకమత్యమూ, వాటిలాభాలు, అన్నీ కలిపి ఓ ఉపన్యాసం యిచ్చాను పెద్దదానికి. ఐదారేండ్ల పిల్లగదా అంత మాత్రం గ్రహించుకోగూడదూ మరి! నేనేదో బూచివాణ్ణైనట్టూ, తన్ను చంపుతాననుకొన్నట్టూ అనుకొని బిగ్గరగా యేడవటం మొదలుపెట్టింది.

‘ఛీ! దీనిదుంపతెగా అనుకున్నాను. యేమిచెయ్యటానికి తోచదు. అసలు ఆలోచించటానికైనా ఊపిరితిరగని స్తేనా, ఆలోచన తోచని స్తేనా ?

తెల్లవారుతున్నది. కొంచెం కొంచెం వెలుతురు గూడా వచ్చింది. పెద్దమ్మాయ్! ఆ మహారాణిగారు వస్తున్నారేమో చూడమ్మా! పో బయటికిపోయి చూడూ’ అని గద్దించాను.

ఉన్నవాటన్నిటికీ తోడు ఈ బయటకు పొమ్మంటము పెద్దదానికి తప్పుగా తోచింది

ఉంటే కొడతానను కుందో యేమో, వాకిట్లో నుంచుని యేడ వటం ఎక్కువ చేసింది. ఊరుకోమంటే ఊరుకోదు. ఇంట్లోకి రమ్మంటే రాదు. అబ్బా! ఇహ చూడండి! వాకిట్లో పెద్దది, ఇంట్లో కుర్రవాడు, మధ్య బుజానెక్కి కూడా చిన్నది, సర్వం యేడ్పుమయం జగత్తనిపించారు.

చెప్పనే చెప్పితినిగా అకుర్రకుంక ఊరుకుండేరకం గాదని; ఉయ్యాల్లోనుంచి కింద కూడా పడ్డాడు. ఇఖ వాణ్ణిపట్టవగ్గాల్లేవు.

'ఓయీపిల్లలూ నేనేం కసాయివాణ్ణికాదు! మిమ్మల్నేం చంపను. అయినా యింతమంది ఒక్కసారిగా యేడిస్తే మటుకు, నాశాంతం కూడా చప్పబడి ఊరుకుంటుంది. ఆ తరవాత యేమ నుకున్నా లాభంలేదు. ఊరుకోండి.' అని లాలనగా కూడా చెప్పేశాను. ఒక్కరూ వినరే, వీళ్ళదుంపతెగ!

ఎంతచెప్పినా దిగని చిన్నమ్మాయిని బలవంతాన కిందకు దించి కిందపడ్డ కుర్రవాణ్ని యెత్తుకొని పరుపుమీద పడుకో బెట్టాను. ఇహ చూచుకోండి ఆచిన్నది. కిందబడి దొర్లడం ఆరంభించింది. మాకొంప చాలా పెద్దదైనప్పటికి, ఆ చిన్న దానికి రెండు పొల్లిగింతలకుకూడా చాల్లేదు. పోనీ అది తన్ను కుంటే తన్నుకున్నది. పరుపుమీద పడుకోబెట్టబడిన ఆ మహా రాజశ్రీగాడన్నా ఊరుకోగూడదు? అంతటితోనన్నా ఊరు కున్నాడా అవెధవాను. ఆ చెయ్యవలసిన రెండుపనులు కూడా మంచంమీదనే చేశాడు. అటూ యిటూ పొర్లాడుతూ తన్నుకోడంలో పరుపు, దిండ్లూ, శాలువా యావత్తు కలగా పులగం చేశాడు. ఎత్తుకుందామా పీల్లేదు. చూడండి నా అంతటి శాంత పురుషుడికి కూడా విసుగుపుట్టి - మనం కూడా

బావురుమని పెద్దగా యేడుద్దామా - అనిపించింది. ఛీ, చుట్టు ప్రక్కలవాళ్లు యేమన్నా అనుకుంటారేమో అని మానేశాను నాలో నేనే సద్దుకొని.

ఇట్లా కాదని, పెట్టెలోవున్న నిమ్మతొనలూ, వంచదార గోలీలూ, అవీ యివీ ఇచ్చిచూశాను. వీళ్ళదుంపతెగ అవి తింటూనే యేడవటం మొదలు పెట్టారు.

సామదాన భేదోపాయాలు ఎప్పుడైతే పనిచెయ్యలేదో ఇఖ దండోపాయం తప్ప నాకేమీ కనపడలేదు. వెంటనే ఓ బెత్తం పుచ్చుకొని, 'నోరుమూస్తారా? ముయ్యరా? పుంథాకోరుల్లారా!' అని తయారయ్యేటప్పటికి చంపుతాననుకున్నారో యేమో, మరీ మరీ సాగించారు. పెద్దదిమటుకు బజారున పడ్డది.

ఏమీ చెయ్యటానికి తోచలేదు. వాళ్ళ యేడుపు వాళ్లది, నా యేడుపు నాదీలాగ దిగాలబడి నించున్నాను.

ఇంతట్లోకే మా ఆవిడవచ్చింది. వచ్చినమనిషి నా ఓర్పుకు సంతోషిస్తుందనీ, నా కష్టానికి తగిన శాంతివాక్యాలు నాలుగు చిలకరిస్తుందనీ యేవేవో కలలు కంటున్నాను. వచ్చీ రావటంతోటే ఆమె అన్నమాటలివి.

'ఏమండి! యేమిటీగోల! ఎందుకు పిల్లల్ని ఇలా చంపుకొని తింటున్నారు. చాల్లేస్తురూ, మీ ప్రతాపం మీరూనూ, పిల్లలమీదేనా? ఊరుకోండమ్మా ఊరుకోండి!'

పిల్లలు ముగ్గుర్నీ దగ్గిరకుతీసుకొందో లేదో, వాళ్లదుంపతెగా మంత్రించినట్టు అందరూగూడా మానేశారు.

ఇఖ యేమనుకోవాలి మనం!

# సాహిత్య కుటీర ప్రచురణములు

[ గీతికా నాటికా కథానికా సంపుటీకరణములు ]

ఆంధ్రరాష్ట్రము
కమలాకరము
రత్నశాల
స్త్రీహితబోధిని
మందారము
పాలవెల్లి
వనమాల
మధుకరి
నందనవనం

## సాహిత్య కుటీరము

గొట్టిపాడు చిలకలూరిపేటపోస్టు